శ్రీ రామ

# స్తోత్రకదంబం

ఇయ్యది

విశాఖ పట్టణంజిల్లా కుమిలి గ్రామవాస్తవ్యులు ఉభయ
భాషా పండిత కవివరేణ్యులును షట్శాస్త్ర
ధురీణులు ననేక గ్రంథకర్తలు పంచాక్షరీ
దీక్షాపరులునగు

కీ॥ శే॥ ముదిగంటి నృసింహశాస్త్రి గారి
కనిష్ఠ పుత్రుడు

## ముదిగంటి సూర్యప్రకాశరావుచే.

సంపాదింపబడెను.

బందరు — బచ్చుపేట
శ్రీ ఆర్యానంద ప్రెస్ వారిచే ముద్రింపబడియె

1960

# పరిచయము

సీ॥ తొలిపల్కుయంచును తొల్లిటినుండియు ।
వచ్చు యాచారంబు వలదనంగ ।
రావేరికైనను వ్రాసిన వారల ।
ప్రచురించువారల ప్రభలుదెలియ ।
పూర్వకాలమునుండి సర్వజ్ఞులనబడు ।
పెద్దల స్తోత్రంబు పేర్కొనబడె ।
భక్తులు వీటిని పాపహరంబచు ।
సర్వకాలంబుల చదువు చున్న ।

గీ॥ వారిపుణ్యంబులెక్కించు వారుగలరె ।
స్తోత్రములకు దండకములు శ్రుతులునవగ ।
జనుప ముదిగంటి నరసింహశాస్త్రిగారు ।
తొల్లి వ్రాసిరి వీటిని తూర్ణముగను ।

సీ॥ వారివిద్యా ప్రవీణత వారికవిత ।
వారిజ్యోతిష గ్రంథముల్ వారివైద్య ।
గ్రంథముల్ కళాశాస్త్రముల్ గాంచినాడ ।
చిన్ననాట పరిచయంబున గన్నవాడ ॥

గీ॥ సీతరామాయణంబును వాతపుత్ర ।
మహిమ సూర్యనారాయణ, మంద, దుర్గ ।
శంకరుల దండకముల సప్తకంబు ।
పూర్వ స్తోత్రముల్గూర్చిన పుస్తకంబు ।

సీ॥ రాముని బలగంబు రంజిల్లు నట్లుగ ।
నాతిథ్య మొసగిన యతివరుండు ।
అలభరద్వాజుండు నాదిమ ఋషియాట ।
గోత్రమతనిపేర కూడియుండె ।
ముదిగంటి వారైరి మునిగంటి వారలు ।
సరయూనదీతీర సరసునుంట ।
ముదముబొందుటచేత ముదిగంటి వారైరి ।

మునిగంటివార్రైరి మునులగనుట ।

గీ॥ సర్వశాస్త్ర వ్యాసి జనకుండు నరసింహ
శాస్త్రి మాతయె సీత సద్గుణ గుణ ।
ములనలరెడు సోదరులు నక్క చెల్లెండ్రు ।
యిద్దరిద్ద రెయన యెలమిజెంధి ॥

గీ॥ సూర్యప్రకాశరాయుండు శ్రోత్రియుండు ।
చిన్ననాటనుండియు భక్తిగన్నవాడు ।
జనకరచిత గ్రంధము చదివివాని ।
నచ్చువేయించి పితరుల యప్పుదీర్చె ॥

గీ॥ ఇందునున్న విషార్థన లెవ్వరైన ।
దినదినంబు పఠించిన దివ్యకాంతి ।
భక్తి శ్రద్ధలు జ్ఞానంబు బడయగలరు ।
ముక్తి గోరుచు చదివిన మోక్షమబ్బు ॥

—స్వామి శివానంద

---

## విజ్ఞప్తి

ప్రపంచముననెల్ల మతములలోఁబ్రతిమానవుండు, స్మరణమూలము వనో, సంకీర్తనరూపంబుననో పూజలు మూలముననో, గడియరెూ క్షణమో నేదో కొంతకాల మనుదినము లేక వారమునకొకసారిరెూ మాసమున కొకతూరిరెూ లేక వత్సరమున కొకసారిరెూ మనస్సు నిలుపుచున్నారను మాట యెల్లరకు విశదీకరమే. కలలోనైనను దనుమున్నెరుంగని మహాకష్టాత్ముడైనట్టి దుర్బలుడాపత్సమయము నందైనను భగవంతుని ప్రయత్నపూర్వకంబుగనో యప్రయత్నము గానో స్మరించుట మనము నిత్యము గమనించుచున్న విషయమే. పశుపక్ష్యాదులకంటె మానవులకు బుద్ధికుశలత, జ్ఞానాజ్ఞాన విచక్షణ ప్రసాదింపబడినది కాబట్టి, పిపీలికాది బ్రహ్మపర్యంతము సృష్టించి పాలించుచున్న భగవంతునియందు సంపూర్ణ విశ్వాసముకలిగి · భక్తి

పూర్వకముగా భగవన్నామ సంకీర్తనమెల్లరు చేయుట కర్తవ్యము. పండితుల సాంగత్యముచేతనో, సద్భక్తుల సందర్శనమువలననో, తీర్థయాత్రలు దేవతాసందర్శనము చేయుటవలననో, లేక యెట్టి శ్రమ లేకయే తమ యిండ్లలోనుండియే భగవత్సంబంధమగు గ్రంథముల పఠనపారాయణలు జేయుటవలననో భక్తిని మనంబున నంకురింపజేసుకొనవలెను.

భక్తిరసమగు గద్యపద్య శ్లోక దండకములపుడపుడు భగవత్సంబంధమగు ప్రాచీనాధునిక కవివరేణ్యులచే రచింపబడినవి లభించినపుడెల్ల జదువుచుండుట ప్రప్రథమములో నుత్సాహము గలిగి, రాను రాను వాటినెల్లను నిత్యపారాయణ కుపయుక్తముగా నుండుటకు, యొక చిన్న పుస్తకరూపంబున నొకచోట కూర్చినచో నాకు నత్యంతోపయుక్తంబుగా నుండుననెడు తలంపు బొడమెను. నాటి నుండియు పురాణేతిహాసాది భక్తిపూరితములైన గ్రంథములు లభించినపుడెల్ల జదువుచు, నాకు వానిలో హృదయరంజకమగునవియు, భక్తిరసభరితంబులైనవియు, కవితామాధుర్యము గలిగినవియు సులభోచ్చారణ గ్రాహ్యముల కనుకూలమైనవియు గొన్ని శ్లోకములు పద్యములు దండకములు చేర్చి "శ్రీ భగవన్నామ సంకీర్తన" యను పేర నొక చిన్న పుస్తకరూపంబుగా బొందుపరచితిని. ఈ చిన్ని పొత్తము నాకు నిత్యపారాయణకు మిక్కిలి సులభముగా నుపయోగబడుచున్నది.

ఇందులో గల పద్యములు శ్లోకములు దండకములు నా స్వాంత కవనము గావనియు, యివన్నియూ యితర గ్రంథములలోనుంచి గ్రహింపబడినవనియు, నచ్చటచ్చట మాత్రమే నా పద్యములనియు వినయపూర్వకముగా మనవి జేసుకొనుచున్నాను.

మరియు యీ పొత్తముయొక్క స్వహస్త లిఖిత ప్రతి నా స్వాంత యుపయోగమునకై నిర్ణయించుకొనుటచే, చాలాకాలమట్టి వ్రాతప్రతిగానే యుండి నా మనస్సంకల్పమును నెరవేర్చుచుండెను. అట్లుండగా యిటీవల కొందరు మిత్రులా ప్రతిని జూచుట తటస్థించగా

భాని నచ్చో వ్రాయించిన స్తోత్రపారాయణాభిలాషులగు భక్తులకుపయోగి పడునని నన్ను ప్రోత్సహించుటచే స్తోత్రకదంబమను పేర దీని నచ్చొ త్తించుటకు బూనుకొంటిని.

బుధజనవిధేయుడు

ముదిగంటి సూర్యప్రకాశరావు

---

## ఉపోద్ఘాతం

కం॥ ఏ కథలయందు పుణ్యశ్లోకుడు హరి సెప్పబడును
సూరిజనముచే నా కథలు పుణ్యకథలని యాకర్ణింపు
దురు పెద్దలతిహర్షమునన్॥

కం॥ భూషణములు సెవులకు బుధ। తోషణము లనేకజన్మ
దురితౌఘవిని। శ్శోషణములు మంగళతర ఘోషణములు
గరుడగమను గుణభాషణముల్॥

గీ॥ చేతులారంగ శివునిఁ బూజింపఁడేని। నోరునొవ్వంగ హరి
కీర్తి నుడువడేని। దయయు సత్యంబు లోనుగాఁ దలపఁడేని
కలుగనేటికి తల్లుల కడుపుచేటు॥

కం॥ చెడుకరులు హరులు ధనములు చెడుదురు నిజసతులు సుతులు
జెడు జెనటులకుం జెడకమనునెర సుగుణులకు।
జెడనిపదార్థములు విష్ణుసేవానిరతుల్॥

---

# విషయసూచిక

శ్రీగురుభ్యోనమః.

హరిః ఓం.

# స్తోత్రకదంబం.

## ఇష్టదేవతాప్రార్థన.

ఉ॥ శ్రీరమణీమనోవిభుని శీలపవిత్రుని నామరూపభే
దారహితుఁ సమస్తమునితాపసవంద్యు ననంతరూపునిఁ
భూరియశోవిశాలు సురభూసురసేవ్యుని సన్నుతామరుం
నాఁగిభజించుచున్నాఁడ ! మదిఁగోరికలీరికలెత్తనిచ్చలుఁ.

---

## విఘ్నేశ్వరస్తుతి.

శ్లో॥ శుక్లాంబరధరం విష్ణుం శశివర్ణం చతుర్భుజం ।
ప్రసన్నవదనం ధ్యాయే త్సర్వవిఘ్నోపశాంతయే।

శ్లో॥ అగజాననపద్మార్కం గజానన మహర్నిశం ।
అనేకదం తం భక్తానా మేకదంతముపాస్మహే ।

శ్లో॥ గజాననం భూతగణాధిసేవితం ।
కపిత్థజంబూఫలసారభక్షిణం ।
ఉమాసుతం శోకవినాశకారణం ।
నమామి విఘ్నేశ్వర పాదపంకజం ।

శ్లో॥ ఏకదంతం మహాకాయం తప్తకాంచనసన్నిభం ।
లంబోదరం విశాలాక్షం వందేహం గణనాయకం ॥

శ్లో॥ వాగీశాద్యాస్సుమనసస్సర్వార్థానాముపక్రమే ।
యన్నత్వాకృతకృత్యాస్స్యుస్తంనమామి! గజాననం ॥

శ్లో॥ సుముఖ శ్చైకదంతశ్చ కపిలో గజకర్ణకః ।
లంబోదరశ్చ వికటో విఘ్నరాజో వినాయకః ।
ధూమకేతుర్గణాధ్యక్షః ఫాలచంద్రో గజాననః ।
వక్రతుండ శ్శూర్పకర్ణో హేరంబ స్కందపూర్వజః ।
షోడశైతానినామాని యఃపఠేచ్ఛృణుయాదపి ।
విద్యారంభేవివాహేచ ప్రవేశేనిర్గమేతథా ।
సంగ్రామే సర్వకార్యేషు విఘ్నస్తస్యనజాయతే ॥

శ్లో॥ బాలార్కకోటిద్యుతి మప్రమేయం ।
బాలేందురేఖాకలితోత్తమాంగం ।
భ్రమద్ద్విరేఫావృతగండభాగం ।
భజేభవానీతనయం గణేశం ॥

శ్లో॥ బీజాపూర గదే క్షుకార్ముక రుజాచక్రాబ్జ పాశోత్పల ।
వ్రీహ్యగ్ర స్వవిషాణరత్న కలశప్రోద్యత్కరాంభోరుహః ।
ధ్యేయోవల్లభయాసపద్మకర యాశ్లిష్టోజ్జ్వల దూభ్షయా ।
విశ్వోత్పత్తి విపత్తి సంస్థిత కరో విఘ్నేశ ఇష్టార్థదః ॥

---

కం॥ ఫణిభూషణాగ్రతనయుని ।
మణిభూషణభూషితాంగు మదగజవక్త్రున్ ।
గణనాథు సేవితామర ।
గణనాథుని సన్నుతింతుఁ గౌతుకమతినై ॥

ఉ॥ తుండమునేకదంతమును దోరపుబొజ్జయు వామహస్తము ।
న్మెండుగ మ్రోయుగజ్జెలును మెల్లనిచూపులు మందహాసమున్ ।
గొండొకగుజ్జురూపమును గోరినవిద్యలకెల్లనొజ్జయై ।
యుండెడిపార్వతీతనయ! యోయిగణాధిప! నీకుమ్రొక్కెదన్ ॥

---

# సరస్వతీప్రార్థన.

శ్లో॥ సరస్వతీ! నమస్తుభ్యం వరదే కామరూపిణీ !
విద్యారంభంకరిష్యామి; సిద్ధిర్భవతు మే సదా ॥

శ్లో॥ పద్మపత్రవిశాలాక్షీ ! పద్మకేసరవర్ణినీ !
నిత్యంపద్మాలయా దేవీ ! సామాంపాతుసరస్వతీ !

శ్లో॥ సరస్వతీమయందృష్ట్వా వీణాపుస్తకధారిణీం ।
హంసవాహనసమాయుక్తా విద్యాదానకరీమమ ॥

శ్లో॥ ప్రథమంభారతీనామ ద్వితీయంచసరస్వతీ ।
తృతీయంశారదా దేవీ చతుర్థంహంసవాహినీ ।
పంచమంజగతీఖ్యాతా షష్ఠంవాగీశ్వరీతథా ।
కౌమారీసప్తమంప్రోక్త మష్టమంబ్రహ్మచారిణీ ।
నవమంబుద్ధిధాత్రీచ దశమంవరదాయినీ ।
ఏకాదశంక్షుద్రఘంటా ద్వాదశంభువనేశ్వరీ ।
బ్రాహ్మీద్వాదశనామాని త్రిసంధ్యాయఃపఠేన్నరః ।
సర్వసిద్ధికరీతస్య ప్రసన్నా పరమేశ్వరీ ।
సామేవసతుజిహ్వాగ్రే బ్రహ్మరూపాసరస్వతీ ।

---

కం॥ వాణి న్నీలపయోధర ।
వేణి న్మృదుమధురవాణి విశ్రుతపులిన ।
శ్రోణి న్వీణాపుస్తక ।
పాణిం గల్యాణిఁ దలఁతుఁ బద్మజురాణిన్ ।

శా॥ తల్లీ ! నిన్నుఁదలంచి పుస్తకముచేతంబూనితిన్ నీవునా
యుల్లంబందుననిల్చి జృంభణముగా నుక్తుల్ సుశబ్దంబు
శోభిల్లం బల్కుము నాదువాక్కునను సంప్రీతిన్జగన్మోహినీ ।
ఫుల్లాబ్జాక్షి సరస్వతీ ! భగవతీ ! పూర్ణేందుబింబాననా !

ఉ॥ శారదనీరదేందుఘనసారపటీరమరాళమల్లికా ।
హారతుషారఫేనరజతాచలకాశఫణీశకుందమం ।
దారసుధాపయోధిసితతామరసామరవాహినీశుభా ।
కారత నొప్పునిన్నుమదిఁగానఁగనెన్నఁడుగల్గు భారతీ ।

ఉ॥ క్షోణితలంబున న్నుదురుసోఁకఁగ మ్రొక్కి నుతింతు సైకత ।
శ్రోణికిఁ జంచరీకచయసుందరవేణికి రక్షితామర ।
శ్రేణికిఁ దోయజాతభవచిత్తవశీకరణైకవాణికి ।
న్వాణికి నక్షదామశుకవారిజపుస్తకరమ్యపాణికిన్ ॥

ఉ॥ అంబ ! నవాంబుజోజ్జ్వలకరాంబుజశారదచంద్రచంద్రికా ।
డంబరచారుమూర్తి ప్రకటస్ఫుటభూషణరత్నదీపికా ।
చుంబితదిగ్విభాగ శ్రుతిసూక్తివివిక్తనిజప్రభావభా ।
వాంబరవీధివిశ్రుతవిహారిణి ! నన్గృపఁజూడు భారతీ ।

---

## ఆంజనేయస్తవం.



శ్లో॥ శ్రీరామదూతం జగదేకపూతం ।
శుభాకరం దానవలోకభీకరం ।
జితేంద్రియం నమ్రజనామరద్రుమం ।
నమామివాతాత్మజమాంజనేయం ॥

శ్లో॥ అంజనానందనం వీరం జానకీశోకనాశనం ।
కపీశమక్షహంతారం వందేలంకాభయంకరం ॥

శ్లో॥ ఆంజనేయమతిపాటలాననం ।
కాంచనాద్రికమనీయవిగ్రహం ।
పారిజాతతరుమూలవాసినం ।
భావయామి పవమాననందనం ॥

శ్లో॥ మనోజవం మారుతతుల్యవేగం ।
జితేంద్రియం బుద్ధిమతాంవరిష్ఠం ।

వాతాత్మజం వానరయూథముఖ్యం ।
శ్రీరామదూతం శిరసానమామి ॥

శ్లో॥ ఆమిషీకృతమార్తాండం గోష్పదీకృతసాగరం ।
తృణీకృతదశగ్రీవ మాంజనేయం నమామ్యహం ।

---

మ॥ తనరంగాయముచేత రామచరణద్వంద్వైకదాస్యంబు పో ।
చ్చినభక్తిం దగువాక్కుచే ననిశముక్ శ్రీరామనామప్రవ ।
ర్తనముక్ జిత్తముచేత రామపరతత్వధ్యానముం జేయు శ్రీ ।
హనుమంతుక్ సముపాశ్రయింతు మదభీష్టార్థంబు సిద్ధింపఁగ॥

---

# ఆదిత్యస్తోత్రం.

శ్లో॥ ఆదిదేవ ! నమస్తుభ్యం ప్రసీదమమభాస్కర ।
దివాకర ! నమస్తుభ్యం ప్రభాకర ! నమోఽస్తుతే ॥

శ్లో॥ బ్రహ్మవిష్ణ్వీశ్వరాకారం బ్రహ్మాద్యమరపూజితం ।
ఛాయానాథంత్రయీవేద్యం వందేసూర్యందివాకరం ॥

శ్లో॥ బ్రహ్మస్వరూపముదయే మాధ్యాహ్నేతుమహేశ్వరం ।
సాయంధ్యాయేత్సదావిష్ణుం త్రిమూర్తిశ్చదివాకరః ॥

శ్లో॥ ఉదయగిరిముపేతం భాస్కరంపద్మహస్తం ।
సకలభువననేత్రం నూత్నరత్నోపధేయం ।
తిమిరకరిమృగేంద్రం బోధకం పద్మినీనాం ।
సురవరమభివాద్యం సుందరం విశ్వరూపం ॥

శ్లో॥ ధ్యాయేత్సూర్యమనంతశక్తికిరణం తేజోమయం భాస్కరం ।
భక్తానామభయప్రదం దినకరం జ్యోతిర్మయం శంకరం ।
ఆదిత్యం జగదీశ మచ్యుత మజం త్రైలోక్యచూడామణిం ।
భక్తాభీష్టవరప్రదం దినమణిం మార్తాండ మాద్యం శుభం ॥

శ్లో॥ రక్తాబ్జ యుగ్మాభయ దానహస్తం ।
కేయూరహారాంగద కుండలాఢ్యం ।

మాణిక్యమాళిం దిననాథమీడే ।
బంధూకకాంతిం విలసత్త్రినేత్రం ॥

శ్లో॥ ధ్యేయస్సదా సవితృమండలమధ్యవర్తీ ।
నారాయణస్సరసిజాసన సన్నివిష్టః ।
కేయూరవాన్ మకరకుండలవాన్ కిరీటీ ।
హారీహిరణ్మయవపుర్ధృతశంఖచక్రః ॥

శ్లో॥ నమస్సవిత్రే జగదేకచక్షుషే ।
జగత్ప్రసూతిస్థితి నాశహేతవే ।
త్రియామయాయ త్రిగుణాత్మధారిణే ।
విరించినారాయణ శంకరాత్మనే ॥

## ఆదిత్యహృదయం.



శ్లో॥ తతోయుద్ధపరిశ్రాంతం సమరేచింతయాస్థితం ।
రావణం చాగ్రతోదృష్ట్వా యుద్ధాయ సముపస్థితం ॥
శ్లో॥ దైవతైశ్చ సమాగమ్యాదృష్టు మభ్యాగతోరణం ।
ఉపాగమ్యాబ్రవీద్రామ మగస్త్యో భగవాన్ఋషిః ॥
శ్లో॥ రామరామ మహాబాహో ! శృణుగుహ్యం సనాతనం ।
యేనసర్వానరీన్వత్స సమరేవిజయిష్యసి ॥
శ్లో॥ ఆదిత్యహృదయం పుణ్యం సర్వశత్రువినాశనం ।
జయావహం జపేన్నిత్యమక్షయ్యం పరమంశుభం ।
శ్లో॥ సర్వమంగళమాంగల్యం సర్వపాపప్రణాశనం ।
చింతాశోకప్రశమన మాయుర్వృద్ధిదముత్తమం ।
శ్లో॥ రశ్మిమంతం సముద్యంతం దేవాసురనమస్కృతం ।
పూజయస్వ వివస్వంతం భాస్కరం భువనేశ్వరం ॥
శ్లో॥ సర్వదేవాత్మకోహ్యేష తేజస్వీ రశ్మిభావనః ॥
ఏషదేవా సురగణాన్ లోకాన్ పాతిగభస్తిభిః ॥

శ్లో॥ ఏషబ్రహ్మాచ విష్ణుశ్చ శివస్కందః ప్రజాపతిః ।
మహేంద్రో ధనదః కాలో యమస్సోమోహ్యపాంపతిః ॥

శ్లో॥ పితరో వసవ స్సాధ్యా హ్యశ్వినౌ మరుతో మనుః ।
వాయు ర్వహ్నిః ప్రజాప్రాణః ఋతుకర్తా ప్రభాకరః ॥

శ్లో॥ ఆదిత్య స్సవితా సూర్యః ఖగః పూషా గభస్తిమాన్ ।
సువర్ణసదృశో భాను స్స్వర్ణరేతా దివాకరః ॥

శ్లో॥ హరిదశ్వసహస్రార్చి స్సప్తసప్తిర్మరీచిమాన్ ।
తిమిరోన్మథనశ్శంభు స్త్వష్టామార్తాండఅంశుమాన్ ॥

శ్లో॥ హిరణ్యగర్భశ్శిశిరా స్తపనోభాస్కరోరవిః ।
అగ్నిగర్భోఽదితేఃపుత్ర శ్శంఖశ్శిశిరనాశనః ॥

శ్లో॥ వ్యోమనాథ స్తమోభేదీఋగ్యజుస్సామపారగః ।
ఘనవృష్టిరపాంమిత్రో వింధ్యవీథీప్లవంగమః ॥

శ్లో॥ ఆతపీమండలీమృత్యుః పింగళస్సర్వతాపనః ।
రవిర్విశ్వోమహాతేజో రక్తస్సర్వభవోద్భవః ॥

శ్లో॥ నక్షత్రగ్రహతారాణా మధిపోవిశ్వభావనః ।
తేజసామపితేజస్వీద్వాదశాత్మన్నమోఽస్తుతే ॥

శ్లో॥ నమఃపూర్వాయగిరయే పశ్చిమాయాద్రయేనమః ॥
జ్యోతిర్గణానాంపతయే దినాధిపతయేనమః ॥

శ్లో॥ జయాయజయభద్రాయ హర్యశ్వాయనమోనమః ।
నమోనమస్సహస్రాంశో ఆదిత్యాయనమోనమః ॥

శ్లో॥ నమఉగ్రాయవీరాయ సారంగాయనమోనమః ।
నమఃపద్మప్రబోధాయ మార్తాండాయనమోనమః ॥

శ్లో॥ బ్రహ్మేశానాచ్యుతేశాయ సూర్యాయాదిత్యవర్చసే।
భాస్వతేసర్వభక్షాయ రౌద్రాయవపుషేనమః ॥

శ్లో॥ తమోఘ్నాయహిమఘ్నాయ శత్రుఘ్నాయమితాత్మనే ।
కృతఘ్నఘ్నాయదేవాయ జ్యోతిషాంపతయేనమః ॥

శ్లో॥ తప్తచామీకరాభాయ వహ్నయేవిశ్వకర్మణే ।
నమస్తమోఽభినిఘ్నాయ రవయేలోకసాక్షిణే ॥

శ్లో॥ నాశయత్యేషవైభూతం । తథైవసృజతిప్రభుః
పాయత్యేషతపత్యే వర్షత్యేషగభస్తిభిః ॥

శ్లో॥ ఏషసుప్తేషుజాగర్తి భూతేషుపరినిష్ఠితః ।
ఏషఏవాగ్నిహోత్రంచ ఫలంచైవాగ్నిహోత్రిణాం ॥

శ్లో॥ వేదాశ్చక్రతవశ్చైవ । క్రతూనాంఫలమేవచ ।
యానికృత్యానిలోకేషు । సర్వాణ్యేషురవిప్రభుః ॥

శ్లో॥ యేనమాపత్సుకృచ్ఛ్రేషు । కాంతారేషుభయేషుచ ।
కీర్తయన్పురుషఃకశ్చిన్నావసీదతిరాఘవః ॥

శ్లో॥ పూజస్వైనమేకాగ్రోదేవదేవజగత్పతిం ।
ఏతత్త్రిగుణితంజప్త్వా యుద్ధేషువిజయిష్యసి ॥

శ్లో॥ అస్మిన్క్షణేమహాబాహో రావణంత్వంవధిష్యసి ।
ఏవముక్త్వాతదాఽగస్త్యోజగామచయథాగతం ॥

శ్లో॥ ఏతచ్ఛ్రుత్వామహాతేజా నష్టశోకోభవత్తదా ।
ధారయామాససంప్రీతో రాఘవఃప్రయతాత్మవాన్ ॥

శ్లో॥ త్రిరాచమ్యశుచిర్భూత్వా ధనురాదాయవీర్యవాన్ ।
ఆదిత్యంప్రేక్ష్యజప్త్వాతు పరంహర్షమవాప్తవాన్ ॥

శ్లో॥ రావణంప్రేక్ష్యహృష్టాత్మాయుద్ధాయసముపాగమత్ ।
సర్వయత్నేనమహతా వధేతస్యధృతోఽభవత్ ॥

శ్లో॥ అధరవిరవదన్ నిరీక్ష్యరామం ।
ముదితమనాఃపరమంప్రహృష్యమాణః ।
నిశిచరపతిసంక్షయంవిదిత్వా ।
సురగణమధ్యగతోవచస్త్వరేతి ॥

# శ్రీసద్గురుస్తుతి.



శ్లో॥ ఆనందమానందకరం ప్రసన్నం ।
జ్ఞానస్వరూపం నిజబోధయుక్తం ।
యోగీంద్రమీడ్యం భవరోగవైద్యం ।
శ్రీమద్గురుం నిత్యమహంనమామి ॥

శ్లో॥ గురుర్బ్రహ్మాగురుర్విష్ణు ర్గురుదేవోమహేశ్వరః ।
గురుస్సాక్షాత్పరబ్రహ్మ తస్మైశ్రీగురవేనమః ।

శ్లో॥ అఖండమండలాకారం వ్యాప్తంయేనచరాచరం ।
తత్పదందర్శితంయేన తస్మైశ్రీగురవేనమః ॥

శ్లో॥ మన్నాథశ్రీజగన్నాథో మద్గురుశ్శ్రీజగద్గురుః ।
స్వాత్మైనసర్వభూతాత్మా తస్మైశ్రీగురవేనమః ॥

శ్లో॥ అజ్ఞానతిమిరాంధస్య జ్ఞానాంజనశలాకయా ।
చక్షురున్మీలితంయేనతస్మైశ్రీగురవేనమః ॥

శ్లో॥ సచ్చిదానందరూపాయ శంకరాయమహాత్మనే।
కైవల్యకలనాకల్ప తరవేగురవేనమః.॥

శ్లో॥ అద్వైతార్ణవపూర్ణచంద్రమభిధాపద్మాటవీభాస్కరం ।
విద్వత్కోటిసమర్చితాంఘ్రియుగళంప్రద్వేషికక్షానలం ।
హృద్యాభేద్యసమస్తవేదపఠనప్రోద్యద్వివేకాలయం ।;
స్విద్యద్వాగమృతం పరాత్పరగురుంశ్రీశంకరం తం భజే ॥

శ్లో॥ శ్రుతిస్మృతిపురాణానా।మాలయం కరుణాలయం ।
నమామి భగవత్పాదం శంకరం లోకశంకరం ॥

శ్లో॥ శంకరం శంకరాచార్యం కేశవం బాదరాయణం ।
సూత్రభాష్యకృతం వందే భగవంతం పునఃపునః ॥

---

## శ్రీ వ్యాసభగవాన్ స్తుతి.



శ్లో॥ నారాయణం పద్మభువం వసిష్ఠం ।
శక్తించ తత్పుత్రపరాశరంచ ।
వ్యాసం శుకం గౌడపదం మహాంతం ।
గోవిందయోగీంద్ర మథాస్యశిష్యం ॥

శ్లో॥ వ్యాసంవసిష్ఠనప్తారం శక్తేఃపౌత్రమకల్మషం ।
పరాశరాత్మజం వందే శుకతాతం తపోనిధిం ॥

శ్లో॥ వ్యాసాయ విష్ణురూపాయ వ్యాసరూపాయ విష్ణవే ।
నమోవై బ్రహ్మనిధయే వాసిష్ఠాయనమోనమః ॥

శ్లో॥ యం ప్రవ్రజంత మనుపేతమపేతకృత్యం ।
ద్వైపాయనో విరహకాతర ఆజుహావ ।
పుత్రేతితన్మయతయాతరవోభినేదుః ।
తంసర్వభూతహృదయం మునిమానతోస్మి ॥



గీ॥ నాల్గుముఖములులేనట్టినలువయతండు ।
హస్తములురెండుగల్గినహరియతండు ।
శిరమునను గంగలేనట్టి శివుఁడతండు ।
అట్టివ్యాసునినెన్నుదునాత్మయందు ॥



# శ్రీరామస్తుతి.

శ్లో॥ కౌసల్యాగర్భసంభూతం మైథిలీప్రాణవల్లభం ।
కోటికంజశరాకారం శ్రీకారంప్రణమామ్యహం ॥

శ్లో॥ శ్రీరాఘవం దశరథాత్మజ మప్రమేయం ।
సీతాపతిం రఘుకులాన్వయరత్నదీప ।
మాజానుబాహు మరవిందదళాయతాక్షం ।
రామం నిశాచరవినాశకరం నమామి ॥

శ్లో॥ శ్రీరామరామరామేతి రమేరామేమనోరమే ।
సహస్రనామతత్తుల్యం రామనామవరాననే ॥

శ్లో॥ రామాయ రామభద్రాయ రామచంద్రాయ వేధసే ।
రఘునాధాయ నాధాయ సీతాయాఃపతయేనమః ॥

శ్లో॥ వైదేహీసహితం సురద్రుమతలే హైమేమహామంటపే ।
మధ్యేపుష్పకమాసనే మణిమయే వీరాసనేసంస్థితం ।
అగ్రేవాచయతిప్రభంజనసుతే తత్వంమునిభ్యఃపరం ।
వ్యాఖ్యాంతంభరతాదిభిఃపరివృతం రామం భజేశ్యామలం ॥

శ్లో॥ శ్రీమద్దివ్యమునీంద్రచిత్తనిలయం సీతామనోనాయకం ।
వల్మీకోద్భవవాక్పయోధిశశినం స్మేరాననం చిన్మయం ।
నిత్యం నీరదనీలకాయ మమలం నిర్వాణసంధాయకం ।
శాంతం నిత్య మనామయం శివకరం శ్రీరామచంద్రం భజే ॥

శ్లో॥ రామం రాజశిఖామణిం రఘువరం రాకేందుబింబాననం ।
రాజీవాయతలోచనం రణహతానేకాసురం రాఘవం ।
సీతాచారుపయోధరాంచితలసత్కాశ్మీరగంధాంచితం ।
రాజత్కుండలమండితం శుభకరం రామాభిరామం భజే ॥

# హనుమద్విరచిత సీతారామస్తవం.



శ్లో॥ అయోధ్యాపురనేతారం మిథిలాపురనాయకీం ।
రాఘవాణామలంకారం వైదేహీనామలంకృతాం ।
రఘూణాంకులదీపంచ నిమినాంకులదీపికాం ।
సూర్యవంశసముద్భూతం సోమవంశసముద్భవం ।

పుత్రిందశరథస్యాపి పుత్రీంజనకభూపతేః ।
వసిష్ఠానుమతాచారం శతానందమతానుగాం ।
కౌసల్యాగర్భసంభూతం వేదిగర్భోదితాంస్వయం ।
పుండరీకవిశాలాక్షం స్ఫురదిందీవరేక్షణాం ।
మత్తమాతంగగమనం మత్తసారసగామినీం ।

చందనార్ద్రభుజామధ్యం కుంకుమాంకభుజాంతరాం ।
చాపాలంకృతహస్తాబ్జం పద్మాలంకృతపాణికాం ।
సర్వలోకవిధాతారం సర్వలోకవిధాయినీం।
లోకాభిరామంశ్రీరామ మభిరామాంచమైథిలీం ।

దివ్యసింహాసనారూఢం దివ్యస్రగ్వస్త్రభూషణా ।
మనుక్షణంకటాక్షాభ్యా మన్యోన్యేక్షణకాంక్షిణా ।
మన్యోన్యసదృశావేతౌ త్రైలోక్యగృహదంపతీ ।
మిమాయువాంప్రపన్నాస్యాహం భజామ్యతికృతార్థితా ।

మనయస్తౌతియస్తుత్యా రామంసీతాంచభక్తితం ।
తస్యతౌతనుతాంప్రీతౌ సంపదస్సకలాఅపి ।
ఇతీదంరామచంద్రస్య జానక్యాశ్చవిశేషితం ॥

శ్లో॥ విమలకమలనేత్రం విస్ఫురన్నీలగాత్రం ।
తపనకులపవిత్రం దానవధ్వాంతమిత్రం ।
భువనశుభచరిత్రం భూమిపుత్రీకళత్రం ।
దశరథవరపుత్రం నౌమిరామాఖ్యమిత్రం ॥

శ్లో॥ రామం విశ్వమయం వందే రామం వందే రఘూద్వహం ।
రామం విప్రవరం వందే రామం శ్యామాగ్రజం భజే ॥

శ్లో॥ విశ్వోద్భవస్థితిలయాదిషు హేతుమేకం ।
మాయాశ్రయం విగతమాయమచింత్యమూర్తి ।
మానందసాంద్ర మమలంనిజబోధరూపం ।
సీతాపతిం విదితతత్త్వమహంభజామి ॥

శ్లో॥ కాలాంభోధరకాంతికాంతమనిశం వీరాసనాధ్యాసితం ।
ముద్రాంజ్ఞానమయీం దధానమపరంహస్తాంబుజంజానుభిః ।
సీతాంపార్శ్వగతాం సరోరుహకరాం విద్యున్నిభాంరాఘవం ।
పశ్యంతంమకుటాంగదాదివివిధాకల్పోజ్జ్వలాంగం భజే ॥

శ్లో॥ నమోఽస్తు జగతాంనాథ ! నమస్తేభక్తిభావన !
నమఃకారుణికానంత ! రామచంద్ర ! నమోఽస్తుతే ॥

శ్లో॥ దేవదేవ ! నమస్తేఽస్తు । శంఖచక్రగదాధర !
పరమాత్మాఽచ్యుతోఽనంత ! పూర్ణస్త్వంపురుషోత్తమ !

శ్లో॥ నమస్తేరామచంద్రాయ వేధసేపరమాత్మనే ।
అయోధ్యాధిపతేతుభ్యం నమస్స్వామితిసేవితేః ।
త్రాహిత్రాహిజగన్నాథ ! మాంమాయానావృణోతుతే ॥

శ్లో॥ యత్పాదపంకజరజశ్శ్రుతిభిర్విమృగ్యం ।
యన్నాభిపంకజభవఃకమలాసనశ్చ ।
యన్నామసారరసికోభగవాన్పురారి ।
స్తంరామచంద్రమనిశంహృదిభావయామి ॥

శ్లో॥ నమోఽస్తుతే రామ ! తవాంఘ్రిపంకజం ।
శ్రియాధృతం వక్షసిలాలితంప్రియాత్ ।
ఆక్రాంతమేకేనజగత్రయంపురా ।
ధ్యేయంమునీంద్రై రభిమానవర్జితైః ॥

శ్లో॥ భవభయహరమేకం భానుకోటిప్రకాశం ।
కరధృతశరచాపం కాలమేఘావభాసం ।

కనకరుచిరవస్త్రం రత్నవత్కుండలాఢ్యం ।
కమలవిశదనేత్రం సానుజంరామమీడే ॥

శ్లో॥ త్వన్మంత్రజాప్యహమనంతగుణాప్రమేయ ।
సీతాపతే శివవిరించిసమాశ్రితాంఘ్రే ।
సంసారసింధు తరణామలపాదపోతో ।
రామాభిరామ సతతంతవదాసదాసః ॥

శ్లో॥ నమస్తుభ్యంభగవతే విశుద్ధజ్ఞానమూర్తయే ।
ఆత్మారామాయరామాయ సీతారామాయవేధసే ॥

శ్లో॥ నమస్తేరామరాజేంద్ర నమస్సీతామనోహర ।
నమస్తేచండకోదండ నమస్తేభక్తవత్సల ॥

శ్లో॥ త్వమింద్రోఽగ్ని ర్యమోరక్షో వరుణశ్చతథాఽనిలః ।
కుబేరశ్చతథారుద్ర స్త్వమేవపురుషోత్తమ ! ॥

శ్లో॥ త్వమణోరప్యణీయాంశ్చ స్థూలాత్స్థూలతరఃప్రభో ।
త్వంపితాసర్వలోకానాం మాతాధాతాత్వమేవహి ॥

శ్లో॥ కర్మబంధవినాశాయ త్వజ్జ్ఞానంభక్తిలక్షణం ।
త్వద్ధ్యానంపరమార్థంచ దేహిమేరఘునందన ॥

శ్లో॥ దేవదేవజగన్నాథ పరమాత్మాసనాతన ।
నారాయణాఽఖిలాధార సర్వసాక్షినమోఽస్తుతే ॥

శ్లో॥ భజేఽహంసదారామమిందీవరాభం ।
భవారణ్యదావానలాభాభిరామం ।
భవానీహృదాభావితానందరూపం ।
భవాభావహేతుంభవాదిప్రసన్నం ॥

శ్లో॥ సురానీకదుఃఖౌఘనాశైకహేతుం ।
నరాకారదేహం నిరాకారమీడ్యం ।
పరేశం పరానందరూపం వరేణ్యం ।
హరిం రామమీశం భజేభారనాశం ॥

శ్లో॥ సదాభోగభాజాం సుదూరేవిభాంతం ।
సదాయోగభాజా మదూరేవిభాంతం ।

చిదానందకందం సదారాఘవేంద్రం ।
విదేహాత్మజానంద రూపంప్రపద్యే ॥

శ్లో॥ స్ఫురద్రత్న కేయూర హారాభిరామం ।
ధరాభారభూతా సురానీకదానం ।
శరచ్చంద్రవక్త్రం లసత్పద్మనేత్రం ।
ఘృణావారపారం భజేరాఘవేశం ॥

శ్లో॥ సుధీరాశనీలాభ నీలాబ్జకాంతిం ।
విరాధాదిరక్షోవ ధాల్లోకశాంతిం ।
కిరీటాదిశోభం పురారాతిలాభం ।
భజేరామచంద్రం రఘూణామధీశం ॥

శ్లో॥ నవదూర్వాదళశ్యామం పద్మపత్రాయతేక్షణం ।
రవికోటిప్రభాయుక్తం కిరీటేనవిరాజితం ।
కోటికందర్పలావణ్యం పీతాంబరసమావృతం ।
దివ్యాభరణసంపన్నం దివ్యచందనలేపనం ।
అయుతాదిత్యసంకాశం ద్విభుజంరఘునందనం ।
వామభాగేసమాసీనాం సీతాంకాంచనసన్నిభాం ।
సర్వాభరణసంపన్నాం వామాంకేసముపస్థితాం ।
రక్తోత్పలకరాంభోజాం వామేనాలింగ్యసంస్థితాం ।
సర్వాతిశయశోభాఢ్యాం దృష్ట్వాభక్తిసమన్వితః ।
ఉమయాసహితోదేవః శంకరోరఘునందనం ।
సర్వదేవగణైర్యుక్తః స్తోతుంసముపచక్రమే ॥

శ్లో॥ నమోఽస్తురామాయ సశక్తికాయ ।
నీలోత్పలశ్యామలకోమలాయ ।
కిరీటహారాంగదభూషణాయ ।
సింహాసనస్థాయ మహాప్రభాయ ॥

శ్లో॥ నమోఽస్తురామాయ సలక్ష్మణాయ ।
దేవ్యైచ తస్యైజనకాత్మజాయై ।

నమోఽస్తు రుద్రేంద్రయమానిలేభ్యో ।
నమోఽస్తు చంద్రార్కమరుద్గణేభ్యః ॥

శ్లో॥ సురవరమణినీలం సూరిదేవాద్రిమూలం ।
కనకరుచిరచేలం కర్బురేశాదికాలం ।
వినమితమునిజాలం విశ్వవిఖ్యాతశీలం ।
జగదవనవిలోలం జానకీపాలమీడే ॥

శ్లో॥ సుగుణమణిలలామం సుందరాకారసోమం ।
నిఖిలకలుషభీమం నిస్తులౌదార్యసీమం ।
విజితపరశురామం వేదమూర్ధాభిరామం ।
సకలరిపువిరామం జానకీరామమీడే ॥

శ్లో॥ సీతాకళత్రం సితికంఠమిత్రం ।
రాజీవనేత్రం రమణీయగాత్రం ।
రాకేందువక్త్రం రఘురాజగోత్రం ।
సేవేపవిత్రం శ్రితపద్మమిత్రం ॥

శ్లో॥ రామం కామసహస్రసుందరతనుం రాజీవనేత్రాంచితం ।
శ్రీమన్మౌక్తికహారహీరమకుటశ్రీకంకణాలంకృతం ।
సుగ్రీవాంగదనీలమారుతికపిస్తోమాభిరామం విభుం ।
సీతాలక్ష్మణసోదరాదిసహితం సింహాసనస్థం భజే ॥

---

శ్లో॥ దిగ్దేహకాలపరిహీన మనన్యమేకం ।
చిన్మాత్రమక్షర మజం చలనాదిహీనం ।
సర్వజ్ఞ మీశ్వర మనంతగుణవ్యపస్త ।
మాయం భజేరఘుపతింభజతా మభిన్నం ॥

శ్లో॥ రామ ! త్వంజగతామాది రాదిమధ్యాంతవర్జితః ।
పరమాత్మాపరానందః పూర్ణఃపురుషఈశ్వరః ॥

శ్లో॥ వామేభూమిసుతా పురస్తుహనుమాన్ పశ్చాత్సుమిత్రాసుతః ।
శత్రుఘ్నోభరతశ్చపార్శ్వదళయో ర్వాయ్వాదికోణేషుచ ।

సుగ్రీవశ్చ విభీషణశ్చ యువరా ట్తారాసుతో జాంబవాన్ ।
మధ్యే నీలసరోజకోమలరుచిం రామం భజే శ్యామలం ॥

శ్లో॥ సాకేతే శరదిందుకుందధవళే సౌధే మహామంటపే ।
పర్యస్తాగురుధూపదీపలలితే కర్పూరదీపోజ్జ్వలే ।
సుగ్రీవాంగదజాంబవత్పరివృతం సౌమిత్రిణాసేవితం ।
లీలామానుషవిగ్రహం రఘువరం రామం భజే శ్యామలం ॥

శ్లో॥ మాతారామో మత్పితారామచంద్రో ।
భ్రాతారామో మత్సఖారాఘవేశః ।
సర్వస్వంమే రామచంద్రోదయాళు ।
ర్నాన్యందేవం నైవజానేనజానే॥

శ్లో॥ వందేదేవం విష్ణుమశేషస్థితిహేతుం ।
త్వామధ్యాత్మజ్ఞానిభిరంతర్హృదిభావ్యం ।
హేయాహేయద్వంద్వవిహీనం పరమేశం ।
సత్తామాత్రం సర్వహృదిస్థందృశిరూపం ॥

శ్లో॥ ప్రాణాపానౌనిశ్చయబుధ్యా హృదిరుధ్వా ।
ఛిత్వాసర్వం సంశయబంధం సర్వాఘాన్ ।
పశ్యంతీశంయంగతమోహాయుతయంతం ।
వందేరామంరత్నకిరీటంరవిభాసం ॥

శ్లో॥ మాయాతీతం మాధవమాద్యం జగదాదిం ।
మానాతీతం మోహవినాశం మునివంద్యం ।
యోగిధ్యేయం యోగవిధానం పరిపూర్ణం ।
వందేరామం రంజితలోకం రమణీయం ॥

శ్లో॥ భావాభావప్రత్యయహీనం భవముఖ్యై ।
ర్భోగాసక్తైరర్చితపాదాంబుజయుగ్మం ।
నిత్యంశుద్ధంబుద్ధమనంతం ప్రణవాఖ్యం ।
వందేరామంవీరమశేషా సురసారం ॥

శ్లో॥ త్వామాద్యంతంలోకతతీనాం పరమేశం ।
లోకానాంనోకాకికమాన్నైరధిగమ్యం ।
భక్తిశ్రద్ధాభావసమేతై ర్భజనీయం ।
వందేరామంసుందరమిందీ వరనీలం ॥

శ్లో॥ కోవాజ్ఞాతుంత్వామభిమానం గతమానం ।
మానాసక్తోమాధవశక్తో మునిమాన్యం ।
వృందారణ్యేవందితవృందా రకవృందం ।
వందేరామం భవముఖవంద్యం సుఖకందం ॥

శ్లో॥ సత్సంగతింభజస్వహరింశరణ్యం ।
శ్రీరాఘవం మరకతోపలకాంతికాంతం ।
సీతాసమేత మనిశంధృతచాపబాణం ।
సుగ్రీవలక్ష్మణవిభీషణసేవితాంఘ్రిం ॥

శ్లో॥ విమలకమలనేత్రం విస్ఫురన్నీలగాత్రం ।
తపనకులపవిత్రం దానవధ్వాంతమిత్రం ।
భువనశుభచరిత్రం భూమిపుత్రీకళత్రం ।
దశరధవరపుత్రం నౌమిరామాఖ్యమిత్రం ॥

శ్లో॥ "హరే! రామ! హరే! రామ! రామ! రామ! హరే!
హరే! హరే! కృష్ణ! హరే! కృష్ణ కృష్ణ! కృష్ణ! హరే!
హరే! ఇతిషోడశకం నామ్నాం కలికల్మషనాశనం"

శ్లో॥ రామ! రాఘవ! రామ! రాఘవ! రామ! రాఘవ!
రక్షమాం కృష్ణ! కేశవ! కృష్ణ! కేశవ! కృష్ణ! కేశవ!
పాహిమాం ॥

శ్లో॥ జయతు రఘువంశతిలకః ।
కౌసల్యానందవర్ధనో రామః ।
దశవ దనని ధనకారీ!
దాశరధిః పుండరీకాక్షః ॥

కం॥ శ్రీమన్నామ ! పయోద ।
శ్యామ ! ధరాభృల్లలామ ! జగదభిరామా !
రామాజనకామ ! మహో ।
ద్దామ ! గుణస్తోమధామ ! దశరథరామా !

కం॥ శ్రీకంఠచాపఖండన !
పాకారిప్రముఖవినుతభండన ! విలసత్ ।
కాకుత్థ్సవంశమండన ।
రాకేందుయశోవిశాల రామనృపాల !

ఉ॥ శ్రీరఘురామ! చారుతులశీదళదామ ! శమక్షమాదిశృం
గారగుణాభిరామ ! త్రిజగన్నుతశౌర్యరమాలలామ ! దు
ర్వార కబంధరాక్షసవిరామ ! జగజ్జనకల్మషార్ణవో
త్తారకనామ ! భద్రగిరిదాశరథీ ! కరుణాపయోనిధీ !

కం॥ శ్రీరామా సీతాహృ !
త్సారసరవి భానువంశ సాగరచంద్రా !
భూరిదయారససాంద్రా !
సారసపత్రాక్ష ! రామచంద్రనరేంద్రా !

కం॥ శ్రీరామ! రామ! రామ! ర
మారామామణిమనోరమారమణా! శ్రీ
నారాయణ! నారాయణ!
నారాయణ! నిజసహస్రనామస్తుత్యా!

ఉత్సాహ॥ రామ రామ రామ రామ రామ రామ రామ శ్రీ ।
రామ రామ రామ రామ రామ రామ రామ శ్రీ ।
రామ రామ రామ రామ రామ రామ యంచుఁద ।
న్నామకీర్తనంబుజేసినన్ గలుంగుమోక్షమున్ ॥

శా॥ శ్రీరామా ! రఘునందనా ! రఘుపతే ! సీతామనో
నాయకా !

కారుణ్యాభయదానహస్తవరదా ! కాకుత్థ్సవంశోద్భవా !
దారిద్ర్యాంధతమిస్రతాపహరణా ! తత్త్వాబ్ధిచంద్రోదయా!
రారా ! నామదిలో వసించి కృపతో రక్షింపరా !
క్రొమ్ముక్కెదర్ ॥

కం॥ జోజో మంగళనామా !
జోజో రవికోటిధామ ! జోజోరామా !
జోజో దైత్యవిరామా !
జోజోరఘుసార్వభౌమ ! జోజోశ్యామా !

శ్లో॥ శరణన్నారలయాపదల్ పరిహరించన్ రాముఁడుండగ నే ।
వెరవేలంచును బిన్నపెద్దలు ఋషుల్వేదాంత
శాస్త్రింబులు ।
న్నొరయ న్నమ్మి విభీషణాదిఘను లంబోషించుటల్
సాక్షిగా ।
మరి నిన్నమ్మితిఁ గావుమీ! దయను రామా! యార్త
రక్షామణీ !

చ॥ వశుఁడుగమ్రొక్కెదన్ లవణవార్ధివిజృంభణతానివర్తికిన్ ।
దశదిగధీశమౌళిమణిదర్పణమండితదివ్యకీర్తికిన్ ।
దశశతభానుమూర్తికి సుధారుచిభాషికి సాధుపోషికిన్ ।
దశరధరాజుపట్టికిని దైత్యపతింబొరిగొన్న జెట్టికిన్ ।

ఉ॥ నల్లనివాఁడు పద్మనయనంబులవాఁడు మహాశుగంబులన్ ।
విల్లునుదాల్చువాఁడు గడువిప్పగువక్షమువాఁడు మేలుమైఁ
జల్లెడువాఁడు నిక్కినభుజంబులవాఁడు యశంబుదిక్కులం !
జల్లెడువాఁడు నైనరఘుసత్తము డిచ్చుత మాకభీష్టముల్ ॥

ఉ॥ పాళినిఁ దాటకం దునిమి యాగముగాచి యహల్యఁ
బ్రోచి నీ ।
తాలలన న్వరించి రణదర్పితరావణకుంభకర్ణ ము ।

ఖ్యాళి వధించి రాజ్యమునయంబుగ నేలిన రామచంద్ర భూ।
పాలుఁడు రంగశాయి మనపాలఁ గలండు విచారమేటికే ॥

సీ॥ తాటకమర్దించి తపసిజన్నముగాచి।
హరివిల్లువిరచి ధైర్యమున మెఱసి।
ప్రబలులైనట్టి విరాధకబంధోగ్ర।
ఖరదూషణాది రాక్షసులఁ దునిమి।
వానరవిభుచేలి వాలిఁ గూలఁగ నేసి।
జలరాశిగర్వంబు చక్కఁ జేసి।
సేతువుబంధించి చేరి రావణకుంభ।
కర్ణాదివీరులఁ గడిమిఁద్రుంచి॥

గీ॥ అలవిభీషణు లంకకు నధిపుఁజేసి।
భూమిసుతఁ గూడి సాకేతపురమునందు।
రాజ్యసుఖములు గైకొన్న రామవిభుఁడు।
వరుస నను(బ్రోచుచుండు పవాసగతుల ॥

శా॥ రాతి న్నాతిరొనర్చు లేమిఘనమారా! నీకహో! వర్ణనా
తీతంబౌ భవదీయశక్తి శిలలం దేలింతు సంద్రంబులో।
గోతిం బంకజసూతి జేసెదవు నీకుం దుల్యులున్నారె ? తో
శాతిప్రాభవమూర్తివీవు రఘురామా! భక్తకల్పద్రుమా!

సీ॥ నిన్నాశ్రయించితి; నీవాఁడననియంటిఁ।
"పాహిమాం కోదండపాణి" యంటి,।
రఘుకులదీపకా రక్షింపుమనియంటి।
కరుణాసముద్ర నన్గావుమంటి।
దేవ! యన్యులులేరు దిక్కు నీవని యంటి।
దుష్కృత కర్మముల్ దున్పుమంటి।
నఖిల లోకారాధ్య యభయ మిమ్మనియంటి।
నీప్సితార్థము లెప్పు డియ్యమంటి।

గీ॥ నడుగ నెంత్తైన నితరుల। నమరవంద్య!
పరుల యాచింప నాకేల పరమ పురుష!
దాతలకు దాత వీవుండ। దైవరాయ!
రామతారక దశరథ రాజతనయ॥

సీ॥ సంసార దావాగ్ని సంతప్తులకు సుధా।
స్తోమవర్ష నియుక్తి రామభక్తి।
తాపత్రయామయ తాపపీడితులకు।
రమ్యభేషజయుక్తి రామభక్తి।
పంచమహాపాప పటల సర్పములకు।
రచిత గారుడశక్తి రామభక్తి।
భవవిపద్వారాశిపాత భీతులకును।
ప్రబలతరీ యుక్తి రామభక్తి।

గీ॥ ప్రేమబోధిత గురుమూర్తి రామభక్తి।
కామితాత్మజ నాసక్తి రామభక్తి।
రాజితాఖిల బుధసూక్తి రామభక్తి।
సామరస్యోదిత విముక్తి రామభక్తి।

---

## శ్రీకృష్ణస్తుతి.



శ్లో॥ పార్థసారథి మబ్జాక్షం ద్వారకా నిలయం హరిం।
రుక్మిణీశం హృషీకేశం శ్రీకృష్ణం ప్రణమామ్యహం॥

శ్లో॥ కస్తూరీ తిలకం లలాటఫలకే। వక్షస్థలే కౌంస్తుభం।
నాసాగ్రే నవమౌక్తికం కరతలే వేణుం కరే కంకణం।
సర్వాంగే హరిచందనంచ కలయన్ కంఠేచ ముక్తావళిం।
గోపస్త్రీ పరివేష్టితో విజయతే గోపాల చూడామణిః॥

శ్లో॥ భక్తాపాయభుజంగ గారుడమణి స్త్రైలోక్యరక్షామణి ।
గోపీలోచన చాతకాంబుద మణి స్సౌందర్య ముద్రామణి ।
యఃకాంతామణిరుక్మిణీఘనకుచద్వంద్వైకభూషామణి
శ్రేయో దేవశిఖామణిర్దిశతునో గోపాలచూడామణిః ॥

శ్లో॥ మందారమూలే మదనాభిరామం ।
బింబాధరాపూరితవేణునాదం ।
గోగోపగోపీజనమధ్యసంస్థం ।
గోపం భజే గోకులపూర్ణచంద్రం ॥

శ్లో॥ కోటికందర్పలావణ్యం లీలాధామమనోహరం ।
చంద్రలతుప్రజాజుష్టం పుష్పశ్రీయుక్తవిగ్రహం ।
బ్రహ్మవిష్ణుశివాద్యైశ్చ పూజితంవందితంస్తుతం ।
శ్రీరంరాధికాకాంతం గోలోకేశంనమామ్యహం ॥

శ్లో॥ అంగనామంగనా మంతరేమాధవో ।
మాధవంమాధవం చాంతరేణాంగనా॥
ఇద్ధమాకల్పితే మండలేమధ్యగ ।
స్సంజగౌవేణునా దేవకీనందనం ॥

శ్లో॥ సమ్యఙ్న్యాయకలాపేన మహతాభారతేనచ ।
ఉపబృంహితవేదాయ నమోవ్యాసాయవిష్ణవే ।

శ్లో॥ కృష్ణాయ ! వాసుదేవాయ దేవకీనందనాయచ ।
నందగోపకుమారాయ గోవిందాయనమోనమః ॥

శ్లో॥ నమఃపరమకల్యాణ నమ స్తేవిశ్వభావన ।
వాసుదేవాయశాంతాయ యదూనాంపతయేనమః ॥

శ్లో॥ నమోబ్రహ్మణ్యదేవాయ గోబ్రాహ్మణహితాయచ।
జగద్ధితాయకృష్ణాయ గోవిందాయనమోనమః ॥

శ్లో॥ ప్రసన్నపారిజాతాయ వేత్రతోత్త్రైకపాణయే ।
జ్ఞానముద్రాయకృష్ణాయ గీతామృతదుహేనమః ॥

శ్లో॥ కృష్ణంకమలపత్రాక్షం పుణ్యశ్రవణకీర్తనం ।
వాసుదేవంజగద్యోనిం నౌమినారాయణంహరిం ॥

శ్లో॥ కృష్ణాయ! యాదవేంద్రాయ జ్ఞానముద్రాయయోగినే ।
నాథాయరుక్మిణీశాయ నమోవేదాంతవేదినే ॥

శ్లో॥ జయతుజయతు దేవోదేవకీనందనోఽయం ।
జయతుజయతుకృష్ణోవృష్ణివంశప్రదీపః ।
జయతుజయతుమేఘశ్యామలఃకోమలాంగో ।
జయతుజయతుపృథ్వీభారనాశోముకుందః ॥

శ్లో॥ వేదానుద్ధరతే జగన్నివహతే భూగోళముద్బిభ్రతే ।
దైత్యాన్దారయతే బలింఛలయతే క్షత్రక్షయంకుర్వతే ॥
పౌలస్త్యంజయతే హలంకలయతే కారుణ్యమాతన్వతే ।
మ్లేచ్ఛాన్మూర్ఛయతే దశాకృతికృతేకృష్ణాయతుభ్యంనమః ।

శ్లో॥ సారథ్యమర్జునస్యాజౌకుర్వన్గీతామృతందదౌ ।
లోకత్రయోపకారాయ తస్మైకృష్ణాత్మనేనమః ॥

శ్లో॥ కృష్ణ! త్వదీయపదపంకజపంజరాంత ।
మద్యైవమేవిశతుమానసరాజహంస ।
ప్రాణప్రయాణసమయేకఫవాతపిత్తైః ।
కంఠావరోధనవిధౌస్మరణంకుతస్తే ॥

—:0:—

# శ్రీ జయదేవకృతగీతగోవిందం.



మాళవరాగం - రూపకతాళం

౧ ప్రళయపయోధిజలేధృతవానసివేదం విహి
తవహిత్రచరిత్రమఖేదం కేశవ! ధృతమీన
శరీరం జయజగదీశహరే । ధ్రువం ।

కృష్ణా ! ప్రళయకాలమున సప్తసముద్రము లొక్కుమ్మడి నుప్పొంగి ప్రవహించుకాలమున జలగర్భమున లీనముగాకుండనావవలె వేదముల నుద్ధరించితివి !

౨ క్షితిపతివిపులతరే తవతిష్ఠతిపృష్ఠే ధరణిధర
ణకిణచక్రగరిష్ఠే కేశవ! ధృతకచ్ఛపరూప
జయజగదీశహరే ధ్రువం ॥

కేశవా ! నీకుజయమగుగాక ! విశాలమగు నీభూమండల మంతయు మునిగి పాతాళమునకుఁ బోకుండునటులఁ గూర్మరూపంబున మూపున మోసిరక్షించితివి !

3 వసతిదశనశిఖరేధరణీతవలగ్నా శశినికళంక
కళేవనిమగ్నా కేశవ! ధృతసూకరరూప
జయజగదీశహరే ధ్రువం॥

కృష్ణా ! భూమినంతనుచాపగాఁజుట్టి వరాహావతారము నెత్తి కోరలచేనుద్ధరించితివి.

౪ తవకరకమలేనఖమద్భుతశృంగం దళితహిరణ్య
కశిపువరభృంగం కేశవ ! ధృతనరహరిరూపజ
యజగదీశ హరే ధ్రువం॥

కృష్ణా ! నరసింహావతారమెత్తి భక్తుఁడగు ప్రహ్లాదుని బాధించుచున్న హిరణ్యకశిపుం జంపి ప్రహ్లాదుం గాచితివి.

౫ ఛలయసివిక్రమణేబలిమద్భుతవామన పదన
ఖనీరజనితజనపావన। కేశవ। ధృతవామన
రూప।జయజగదీశహరే ధ్రువం ॥—

కృష్ణా!వామనావతారమెత్తి వటుఁడవై మూడడుగులనేల గోరి ముల్లోకములు వ్యాపించి.బలిచక్రవర్తిని పాతాళమునకుఁ ద్రొక్కితివి.

౬ క్షత్రియరుధిరమయే। జయదపగతపాపం। నపయసి
పయసిశమితభవతాపం। కేశవధృతభృగుపతిరూపం। జయజ
గదీశ। హరే। ధ్రువం॥—

కృష్ణా ! నీవుపరశురామావతారమెత్తి యిరువదియొక్కమార్లు వెంటాడి రాజవంశంబుల రూపుమాపి వారిరక్తము తటాకముల నింపి అందు స్నానముచేసినవారి పాపములు నశించునట్లు అనుగ్రహించితివి.

౭ వితరసిదిక్షురణేదిక్పతికమనీయం. దశముఖమౌళి
బలింరమణీయం। కేశవ।ధృతరామశరీరం।జయ జగ
దీశహరే। ధ్రువం॥—

కృష్ణా! నీవురఘువంశమున రాముఁడవై జన్మించి రావణుని పదితలలు నరికి దిక్పాలురగుపదిమందికి బలినొసఁగితివి.

౮ వహసివపుషివిశదే। వసనంజలదాభం। హలహతి
భీతిమిళితయమునాభం। ధృతహలధరరూపం।
జయజగదీశహరే ధ్రువం॥—

కృష్ణా ! నీవు యదువంశమున జన్మించి బలరాముఁడవై ప్రకాశించితివి—

౯ నిన్దశియజ్ఞవిధేరహహశ్రుతిజాతం సదయహృదయదర్శితపశు
ఘాతం. కేశవ ధృతబుద్ధశరీర। జయజగదీశహరే ధ్రువం॥ —

కృష్ణా! నీవు బుద్ధావతారమునఁ కలియుగమందు యజ్ఞమిష చేగావించు పశువధను "హింస" యని పలురీతులబోధించి "అహింసయేపరమధర్మ" మని శాసించితివి.

౧౦ మ్లేచ్ఛనివహనిధనేకలయసి కరవాలం ధూమకేతుమివకిమపి కరవాలం కేశవ ధృతకల్కిశరీర! జయజగదీశహరే ధ్రువం —

కృష్ణా! కలియుగాంతమున లోకకంటకుల సంహరింపకల్క్యవతారమెత్తితివి.

౧౧ శ్రీజయదేవకవేరిదముదితముదారం శ్రుణశుభదం సుఖదం। భవసారం కేశవ ధృతదశవిధరూప!జయజగదీశహరే ధ్రువం॥

దశావతారరూపుఁడగు నోకృష్ణా! లోకోత్తరమును సంసారబంధనములనుండి ముక్తినొందించునదియు సౌఖ్యదమునగు జయదేవుని గీతమునవధరింపుము.

---

## భైరవిరాగం – త్రిపుటతాళం

౧ శ్రితకమలాకుచ మండలధృతకుండల యేకలితలలితవనమాల జయజయదేవహరే ! ధ్రువం॥—

లక్ష్మీదేవీకుచవ్యాప్తకుండలములుగలట్టియు వనమాలను ధరించినట్టియు కృష్ణా ! నీకుజయమగుగాక !

౨ దినమణిమండలమండన భవఖండన యేమునిజనమానసహంస జయజయ ॥

రవిమండలాంతర్గతుఁడవును సంసారబంధమును ద్రెంపువాఁడవును మునిజనమానసముల విహరించువాఁడవు నగునోకృష్ణా ! నీకు జయమగుగాక ।

3 కాళియవిషధర గంజన । జనరంజన యేయదుకులనలినదినేశ జయ—

శ్రీకృష్ణా ! కాళియుఁడను సర్పమును జంపి జనులకానంద మును గల్గించి సూర్యుడు పద్మములను వికసింపజేయు రీతిని యదు వంశమునుద్ధరించి తేజోవంతమొనర్చిననీకుజయమగుగాక !

౪ మధుమురనరకవినాశన ! గరుడాసన ! యే సురకులకేళినిదాన జయ—

కృష్ణా ! మధ్వాసుర మురాసుర నరకాసురులను జంపిగరుడు నెక్కి తిరుగుచు దేవతలక్రీడలకు విఘ్నమురాకుండ జేయునీకు జయ మగుగాక !

౫ అమలకమలదళలోచన!భవమోచన యే త్రిభువనభవననిధాన॥ జయ ॥

కృష్ణా! వికసించిన పద్మములవంటి నేత్రములు గలిగి భక్తు లను సంసారబంధమునుండి తొలఁగించి మోక్షమొసఁగుచు మూడు లోకములసృష్టికి హేతుభూతుఁడవైన నీకుజయమగుగాక.

౬ జనకసుతాకుచభూషణ!జితదూషణ యే సమరశమితదశకంఠ॥ జయ॥

హరీ ! రామావతారమున సీతకుప్రియుడవై ఖరదూషణాది రాక్షసులఁ జంపి రణమున రావణునిఁగూల్చిన నీకు జయమగుగాక.

౭ అభినవజలధరసుందర! ధృతమందర! యే శ్రీముఖచంద్రచకోర॥ జయ॥

కృష్ణా! క్రొత్తమేఘములవంటి సౌందర్యముగలిగి మందర పర్వతమునెత్తి చకోరము చంద్రదర్శనమున సంతసించునట్లు లక్ష్మీ దేవిముఖబింబముగాంచి యానందించు నీకు జయమగుగాక !

౮ తవచరణే ప్రణతావయ!మితభావయ! యే కురుకుశలం ప్రణతేషు॥ జయ॥

యదునందనా ! నీపాదపద్మములను హృదయమునందుఁ దలంచు మాకు క్షేమమునొసంగుము.

శ్రీజయదేవకవేరిదం। కురుతేముదం యేమంగళముజ్వలగీతి॥ జయజయ॥—

శ్రీపతీ! జయదేవకవిరచించిన యీముద్దుగీతమునీకుసంతోషమునుగలిగించిమంగళమొసంగుగాక.

---

కం॥ శ్రీరుక్మిణీశ! కేశవ!
నారదసంగీతలోల! నగధరశౌరీ!
ద్వారకనిలయ! జనార్దన!
కారుణ్యముతోడ మమ్ము గావుము! కృష్ణా:

కం॥ హరియను రెండక్షరములు
హరియించును పాతకముల నంబుజనాభా!
హరి నీనామమహత్వము
నరయఁగఁ బొగడంగవశమె? హరి! శ్రీకృష్ణా!

కం॥ దండమయా విశ్వంభర।
దండమయా పుండరీకదళనేత్ర! హరీ!
దండమయా కరుణానిధి!
దండమయా! నీకునిపుడు దండముకృష్ణా।

శా॥ శ్రీకృష్ణా!యదుభూషణా! శృంగారరత్నాకరా!
లోకద్రోహినరేంద్రవంశదహనా!లోకేశ్వరా! దేవతా।
నీకబ్రాహ్మణగోగణార్తిహరణా!నిర్వాణసంధాయకా!
నీకుఁ బ్రొక్కెదఁ ద్రుంపవే భవలతల్ నిత్యానుకంపానిధీ।

మ॥ తనకుం భృత్యుఁడు పీనిఁగాచుట మహాధర్మంబు వొమ్మంచునన్
ర్జునసారథ్యము పూనిపగ్గములు చేఁజోద్యంబుగాఁబట్టుచున్।
మునికోలన్ వడిఁబూన్చి ఘోటకములన్ మోదించి తాడించు
చున్।

జనులన్ మోహమునొందఁజేయు పరమోత్సాహమ్ము బ్రశంసిం
చెదన్ ॥

మ॥ నరుమాటల్ విని నవ్వుతో నుభయసేనామధ్యమక్షోణిలోఁ ।
బరులీక్షింప రథంబునిల్పి పరభూపాలావళిం జూపుచున్ ।
బరభూపాయువులెల్లఁ జూపులనశుంభత్కేళి వంచించు నా ।
పరమేశుండు వెలుంగుచుండెడును హృత్పద్మాసనాసీనుఁడై ॥

మ॥ హయరింఖాముఖధూళిధూసరపరిన్యస్తాలకోపేతమై ।
రయజాతశ్రమతోయబిందుయుతమై రాజిల్లు నెమ్మోముతో ।
జయమున్ బార్థునకిచ్చువేడ్క నని నాశస్త్రాహతిం జాలనో ।
చ్చియుఁ బోరించు మహానుభావు మదిలోఁ జింతింతు నశ్రాంత
మున్ ॥

మ॥ త్రిజగన్మోహన శీలకాంతిఁ దను వుద్దీపింపఁ బ్రాభాతసీ ।
రజబంధుప్రభమైన చేలము పయిన్ రంజిల్ల నీలాలక ।
వ్రజసంయుక్తముఖారవింద మతిసేవ్యంబై విజృంభింప మా ।
విజయున్ జేరెడు వన్నెకాఁడు మది నావేశించు నెల్లప్పుడున్॥

గీ॥ ద్రౌపదీమానరక్షక ధార్తరాష్ట్ర ।
గహనపావక శకటారి ! కంసహరణ !
నందనందన ! సచ్చిదానందరూప !
కేశవానంత ! పరమాత్మ ! కృష్ణ ! కృష్ణ !

సీ॥ నవపద్మలోచను భవబంధమోచను ।
భరితశుభాకారు దురితదూరుఁ ।
గంకణకేయూరుఁ గాంచనమంజీరు ।
వివిధశోభితభూషు విగతదోషు ।
బన్నగాంతకవాహు భక్తమహోత్సాహు ।
నతచంద్రజూటు నున్నతకిరీటు ।
హరినీలనిభకాయు । వరపీతకౌశేయుఁ ।
గటిసూత్రధారు జగద్విహారు ।

గీ॥ హారవనమాలికా మహితోరువక్షు ।
శంఖచక్రగదాఖడ్గ శార్ఙ్గహస్తు ।
లలితశ్రీవత్స శోభిత లక్షణాంగు ।
శుభగచారిత్రు దేవకీసుతు నుతింతు ॥

సీ॥ కౌస్తుభవక్ష ! శ్రీకరపాదరాజీవ !
దీనశరణ్య ! మహానుభావ !
కరిరాజవరద ! భాస్కరకోటిసంకాశ !
పవనభుగ్వరశాయి ! పరమపురుష !
వేదవేద్యానంతవిభవ చతుర్దశ ।
భువనశోభనకీర్తి ! పుణ్యమూర్తి !
వైకుంఠపట్టణ వాసయోగానంద !
విహగరాడ్వాహన ! విశ్వరూప

గీ॥ నీలనిభగాత్ర ! శ్రీరమణీకళత్ర !
సద్గుణస్తోమ ! యదుకుల సార్వభౌమ ।
మదరిపువిఫాల మునిజన హృదయలోల ।
వేణుగోపాల భక్తసంత్రాణశీల !

మ॥ చతురంబోధిపరీత భూవలయ రాజానీక కోటీర రం
జితమాణిక్యవిరాజమాన పదరాజీవుండు ధర్మాత్మజుం ।
డతికారుణ్యముతోడ మత్స్యపతికొల్వాసింపఁడే ? నీదు ।
శాశ్వతకారుణ్యముగల్గునంతకును కృష్ణా ! దేవకీనందనా !

మ॥ శ్రీలక్ష్మీధర ! వాసుదేవ ! వరరాజీవాక్ష ! పద్మాసనా ।
వ్యాళాధీశ్వర ! శర్వ ! షణ్ముఖశుకాద్యస్తోత్రసత్పాత్ర ! గో
పాలానీకముఖాబ్జ భాస్కర ! కృపాపాథోధి ! నవ్య గావు మూ
ర్ధాలంకార మయూరపింఛధర ! కృష్ణా ! దేవకీనందనా !

మ॥ అరయన్ శంతనుపుత్రుపై విదురుపై నక్రూరుపై కుబ్జపై ।
నరుపై ద్రౌపదిపైఁ గుచేలునిపయి న్నందవ్రజశ్రీలపైఁ ।

బరఁగన్ గల్గు భవత్కృపారసము నాపైఁ గొంతరానిమ్ము నీ।
చరణాబ్జంబులు నమ్మినాడ ! హరి ! కృష్ణా! దేవకీనందనా !

శా॥ గోవిందా!హరి! యోముకుంద! వరదా! గోపీమనోనాయకా !
గోవిందా ! మురళీవినోదనరతా ! గోపాలలీలారతా !
గోవిందా ! వరచక్రధారి ! యమునాకూలాంతసంచార! యో
గోవిందా ! వనమాలి ! మారమణ ! వైకుంఠా ! ననుంబ్రోవవే!

కం॥ బలమెవ్వఁడు కరి బ్రోవను ।
బలమెవ్వఁడు పాండుసుతుల భార్యనుగావన్ ।
బలమెవ్వఁడు రవిసుతునకు ।
బలమెవ్వఁడు నాకు నీవ బలమాకృష్ణా ॥

క॥ దిక్కెవ్వఁడు ప్రహ్లాదుని ।
దిక్కెవ్వఁడు పాండుసుతుల దీనుల కెపుడున్ ।
దిక్కెవ్వ ఁడాయహల్యకు ।
దిక్కెవ్వరు నీవు నాకు దిక్కవు కృష్ణా ॥

క॥ నీవే తల్లివి తండ్రివి ॥
నీవే నాతోడునీడ ! నీవే సఖుఁడౌ ।
నీవే గురుఁడవు దైవము ।
నీవే నాపతియు గతియు నిజముగఁ గృష్ణా !

క॥ జోజో కమలదళేక్షణ !
జోజో మృగరాజమధ్య ! జోజో కృష్ణా !
జోజో పల్లవకరపద ।
జోజో పూర్ణేందువదన ! జోజోశౌరీ !

# శ్రీ విష్ణు స్తోత్రం.



శ్లో॥ అచింత్యావ్యక్తరూపాయ । నిర్గుణాయ గుణాత్మనే ।
సమస్త జగదాధార । మూర్తయే! బ్రహ్మణేనమః ।

శ్లో॥ సర్గ స్థితి ప్రలయ హేతు మచింత్యశక్తిం ।
విశ్వేశ్వరం విదితవిశ్వ మనంతమూర్తిం
నిర్ముక్తబంధన మపార సుఖాంబురాశిం।
శ్రీవల్లభం విమలబోధఘనం నమామి॥

శ్లో॥ శాంతాకారం భుజగశయనం పద్మనాభం సురేశం ।
విశ్వాకారం గగనసదృశం మేఘవర్ణం శుభాంగం ।
లక్ష్మీకాంతం కమలనయనం యోగిహృద్ధ్యానగమ్యం ।
వందేవిష్ణుం భవభయహరం సర్వలోకైకనాథం ॥

శ్లో॥ నిత్యానందం పరమసుఖదం కేవలం జ్ఞానమూర్తిం ।
విశ్వాతీతం గగనసదృశం తత్వమస్యాదిలక్ష్యం ।
ఏకం నిత్యం విమల మచలం సర్వధీసాక్షిభూతం ।
భావాతీతం త్రిగుణరహితం సద్గురుం త న్నమామి॥

శ్లో॥ నమస్తే నమస్తే జగత్కారణాయ ।
నమస్తే చితే సర్వలోకత్రయాయ ।
నమోఽద్వైత తత్వాయ ముక్తిప్రదాయ ।
నమోబ్రహ్మణే వ్యాపినే శాశ్వతాయ ।

శ్లో॥ గోవింద కేశవ జనార్దన వాసుదేవ ।
సర్వేశ విశ్వ మధుసూదన విశ్వనాథ ।
శ్రీ పద్మనాభ! పురుషోత్తమ! పుష్కరాక్ష!
నారాయణాచ్యుత! నృసింహ! నమోనమస్తే॥

శ్లో॥ తోయరుహోదరాయ భవదుఃఖహరాయ నమోనమోపరే ।
శాయ సరోజకేసరపిశంగ వినిర్మలదివ్యధర్మప ।

స్త్రీయ పయోజసన్నిభపదాయ సరోరుహమాలికాయ కృ।
ష్ణాయ పరాఽపరాయ సుగుణాయ సురారిహరాయ వేధసే॥

శ్లో॥ హంసాయ సత్వనిలయాయ సదాశ్రయాయ।
నారాయణాయ నిఖిలాయ నిరాశ్రయాయ।
సత్సంగ్రహాయ సగుణాయ సదీశ్వరాయ।
సంపూర్ణ పుణ్యపతయే హరయే నమస్తే॥

శ్లో॥ గోవింద గోవింద హరే మురారే।
గోవింద గోవింద రథాంగపాణే।
గోవింద గోవింద ముకుందకృష్ణ।
గోవింద గోవింద నమో నమస్తే॥

శ్లో॥ నమోనమః కారణకారణాయ।
నారాయణా యామితవిక్రమాయ।
శ్రీ శార్ఙ్గచక్రాసి గదాధరాయ।
నమోఽస్తు తస్మై పురుషోత్తమాయ!॥

శ్లో॥ నమామి నారాయణ పాదపంకజం।
కరోమి నారాయణ పూజనం సదా।
వదామి నారాయణనామ నిర్మలం।
స్మరామి నారాయణతత్త్వ మవ్యయం॥

శ్లో॥ శ్రీమత్పయోనిధి నికేతన చక్రపాణే।
భోగీంద్ర భోగ మణిరంజిత పుణ్యమూర్తే।
యోగీశ శాశ్వత శరణ్య భవాబ్ధిపోత।
లక్ష్మీనృసింహ మమ దేహి కరావలంబం॥

శ్లో॥ నారాయణాయ పం - కేరుహనేత్రాయ।
వాసుదేవాయ శ్రీవల్లభాయ
నిత్యాయ పరమాత్మనే నిర్వికారాయ।
శుద్ధరూపాయ జగద్ధితాయ।
గో బ్రాహ్మణహితాయ గురుధర్మమూర్తయే।

బ్రహ్మణ్య దేవాయ పావనాయ।
పరమసద్వైక రూపాయ గోవిందాయ।
సనకాది యోగీంద్ర సన్నుతాయ।

తే॥ గీ॥ త్రిగుణవిరహితాయ శ్రీ హృషీకేశాయ।
కీర్తితాఖిలాయ కేశవాయ।
దురితనిరసనాయ తుభ్యం నమో నమో।
యనుచు భక్తియుక్తి నభినుతింతు॥

శ్లో॥ వయం త్వాం స్మరామో వయం త్వాం భజామో।
వయం త్వాం జగత్సాక్షిరూపం నమామః।
స వేగం నిదానం నిరాలంబ మీశం।
భవాంఽబోధిబోధం శరణ్యం భజామః॥

శ్లో॥ అచ్యుతం కేశవం రామ నారాయణం।
కృష్ణ దామోదరం వాసుదేవం హరిం।
శ్రీధరం మాధవం గోపికావల్లభం।
జానకీ నాయకం రామచంద్రంభజే॥

శ్లో॥ సప్తప్రాకారమధ్యే సరసిజముకులో ద్భాసమానే విమానే।
కావేరీమధ్య దేశే ఫణిపతిశయనే శేషపర్యంకభాగే।
నిద్రాముద్రాభిరామం కటి నికటశిరః పార్శ్వ విన్యస్తహస్తం।
పద్మాధాత్రీకరాభ్యాం పరిచిత చరణం రంగనాథం భజేహం॥

శ్లో॥ హే గోపాలక! హే కృపాజలనిధే! హే సింధుకన్యాపతే!
హే కంసాంతక! హే గజేంద్రకరుణాపారీణ! హే మాధవా!
హే రామానుజ! హేజగత్రయగురో! హేపుండరీకాక్షమాం
హే గోపీజననాథ! పాలయ! పరంజానామి నత్వాంవినా॥

శ్లో॥త్వమేవమాతాచపితాత్వమేవ త్వమేవబంధుశ్చసఖా త్వమేవ।
త్వమేవ విద్యా ద్రవిణం త్వమేవ త్వమేవ సర్వంమమ దేవదేవ॥

శ్లో॥ నారాయణాయ నళినాయతలోచనాయ।
నామావశేషిత మహాబలవైభవాయ।

నానాచరాచర విధాయకజన్మదేశ ।
నాభీపుటాయ పురుషాయ నమః పరస్మై॥

శ్లో॥ కదాచిత్కాళిందీ తటవిపినసంగీత కపరో ।
ముదాగోపీనారీ వదనకమలా స్వాదుమధుపః ।
రమాశంభు బ్రహ్మాఽమరపతి గణేశార్చిత పదో ।
జగన్నాథస్వామీ ! నయనపథగామీ భవతు మే ॥

శ్లో॥ భుజే సవ్యే వేణుం శిరసిశిఖిపింఛం కటితటే ।
దుకూలం నేత్రాంతే సహచర కటాక్షం విదధతే ।
సదా శ్రీమద్బృందావన వసతిలీలాపరిచయో ।
జగన్నాథస్వామీ ! నయనపథగామీ భవతు మే॥

శ్లో॥ కరస్ఫురద్దరస్వర ప్రకంపమాన దిక్తటం ।
ధరాధరాధరాస్థిర ప్రధాన కూర్మరూపకం ।
చరాచరాకరాతత ప్రశస్త కుక్షిశోభితం ।
నిరంతరం దురంతశక్తి నిస్తులం ప్రభుంభజే॥

శ్లో॥ చలత్ప్రదీప్త కుండలం లసత్కపోలమండలం ।
కలావిలాసమోహనం ఖగప్రకాండవాహనం ।
మిళిందసుందరాలకం యమిప్రతానపాలకం ।
బలారివైరిమర్దనం ప్రభావయేజనార్దనం ॥

శ్లో॥ లీలార్ధాంజలి మేక మేవచరితాం సామ్రాజ్యలక్ష్మీప్రదః ।
స్థూలాశేష చరాచరాత్మక జగత్స్థూణాష్టమూర్తే గురో ।
తాలంకానుజ ఫల్గునప్రియకర త్రాయేత తే సంతతం ।
హేలాస్యైశ కృపాకటాక్షలహరీ మామాపదామాస్పదం॥

శ్లో॥ శ్రీనాథ నారాయణ వాసుదేవ ।
శ్రీకృష్ణ భక్తిప్రియ చక్రపాణే ।
శ్రీ పద్మనాభాఽచ్యుత కైటభారే ।
శ్రీరామ పద్మాక్ష హరే మురారే ॥

శ్లో॥ లక్ష్మీకళత్రం లలితాబ్జనేత్రం ।
పూర్ణేందువక్త్రం పురుహూతమిత్రం ।
కారుణ్యపాత్రం కమనీయగాత్రం ।
వందేపవిత్రం వసుదేవపుత్రం ॥

శ్లో॥ సజలజలదనీలం వల్లవీకేళిలోలం ।
శ్రితజనతరుమూలం విద్యుదుల్లాసిచేలం ।
నుతసురమునిజాలం సన్మనోబింబనీలం ।
సురరిపుకుల కాలం నౌమిగోపాలబాలం ॥

శ్లో॥ జరామరణ రోగాది రహితాయామలాత్మనే ।
బ్రహ్మణఃపతయేతుభ్యం జగతాంపతయేనమః ।
లోకా లోకస్వరూపాయ లోకానాం పతయేనమః ।
శంఖచక్ర గదాపద్మ పాణయే విష్ణవేనమః॥

శ్లో॥ నమోహిరణ్యగర్భాయ శ్రీపతే భూపతేనమః ।
నమస్స్వయంభువే తుభ్యం సూత్రాత్మాది స్వరూపిణే ।
విరాట్ప్రజాపతే స్రష్ట్రే జ్ఞనకాయ నమోనమః ।
జాగ్రత్స్వప్న స్వరూపాయ నమస్సత్యాత్మనే నమః॥

శ్లో॥ అప్రమేయాయ శాంతాయ స్వప్రకాశాయ సాక్షిణే ।
నమఃపుంసే పురాణాయ శ్రేయః ప్రాప్త్యైక హేతవే ।
ఆకాశాది ప్రపంచాయ నమస్తద్రూపధారిణే ।
మాయారూపాయ మాయాయా స్సత్తాదానాయ శంభవే॥

శ్లో॥ యోగాయ యోగిగమ్యాయ యోగినామిష్టసిద్ధిద ।
నమస్తే మత్స్యరూపాయ నమస్తే కూర్మరూపిణే ।
నమస్తుభ్యం వరాహాయ నృసింహాయ నమోనమః ।
నమోవామనరూపాయ నమోరామత్రయాత్మనే ।
నమఃకృష్ణాయ సర్వజ్ఞ నమస్తే కల్కిరూపిణే ।
బుద్ధభూతాయ మహేశాయ శివప్రాప్త్యైక హేతవే ॥

శ్లో॥ కర్మణాం ఫలభూతాయ కర్మభూతాయ తే నమః ।
కర్మకర్త్రే నమస్తుభ్యం నమస్తే కర్మసాక్షిణే ।
నమోవిజ్ఞప్తిరూపాయ నమో వేదాంతరూపిణే ।
గుణత్రియాత్మనేతుభ్యం నమోనిర్గుణరూపిణే ॥

శ్లో॥ నమోనక్షత్రరూపాయ నమస్తే సోమరూపిణే ।
నమస్సూర్యాత్మనేతుభ్యం నమోవజ్రధరాయ తే ।

శ్లో॥ నమస్తే పద్మనాభాయ నమస్తే శార్ఙ్గపాణయే ।
నమస్తుభ్యం విశాలాక్ష నమశ్శ్రీధరనాయక ।
నమస్సంసారతప్తానాం తాపనాశైకహేతవే ।
శ్రీతస్మార్తైకనిష్ఠానామ చిరాదేవముక్తిద॥

శ్లో॥ అన్యేషామపిసర్వేషాం సంసారైకప్రదావ్యయ ।
నమోఽసురవిమర్దాయ నమోవిద్యాధరాఽర్చిత ॥

శ్లో॥ క్షీరోదశాయినేతుభ్యం నమోవైకుంఠవాసినే ।
నమో రాగాభిభూతానాం వైరాగ్యప్లవదాయితే॥

శ్లో॥ నిత్యశుద్ధాయ బుద్ధాయ ముక్తాయ సుఖరూపిణే ।
నమోవాచామతీతాయ మనోగమ్యాయ తే నమః ॥
సీతాపతే రామరాధాపతే కృష్ణ ।
శ్రీరుక్మిణీ సత్యభామాపతే ।
వాణీపతే బ్రహ్మ గౌరీపతేశంభో ।
లక్ష్మీపతే సత్యనారాయణ॥

---

గీ॥ వాసుదేవ ! కృష్ణ ! వరద ! స్వతంత్ర ! వి ।
జ్ఞానమయ మహాత్మ ! సర్వపుణ్య ।
పురుష ! నిఖిలబీజ భూతాత్మక బ్రహ్మ ! ।
నీకు వందనంబు నిష్కళంక ! ॥

ఉ॥ ఏ పరమేశ్వరుఁ జగము నిన్నిటఁగప్పిన మాయఁగప్పఁగా ।
నోపక పారతంత్రముననుండు మహాత్మక ! యట్టి నీకు ను ॥

ద్దీపిత భద్రమూర్తికి సుధీజనరక్షణవర్తికిం దనూ।
తాపము వాయ మ్రొక్కెద నుదారతపోధన చక్రవర్తికిన్॥

తే॥గీ॥ నీకు మ్రొక్కెద నత్యంత నియమమొప్ప।
భవ్యచారిత్ర పంకజ పత్రనేత్ర।
చిరశుభాకార! నిత్యలక్ష్మీవిహార।
అవ్యయానంద! గోవింద! హరి! ముకుంద!॥

మ॥ పరమాత్మ్మం డజుఁ డీ జగంబు ప్రతికల్పంబందు గల్పించుఁదా
బరిరక్షించును; దు్రించు; నట్టి యనఘుం బ్రహ్మాత్మునిత్యాజగ
ద్భరితుం గేవలు నద్వితీయుని విశుద్ధజ్ఞాను సర్వాత్ము నీ
శ్వరు నాద్యంతవిహీను నిర్గుణుని శశ్వన్మూర్తిఁ జింతించెదన్॥

మ॥ ఒకసూర్యుండు సమస్తజీవులకుఁ దానొక్కొక్కఁడై తోచు పో।
లిక నే దేవుఁడు సర్వకాలము మహాలీలన్ నిజోత్పన్న జ।
న్యకదంబంబుల హృత్సరోరుహములన్ నానావిధానూనరూ।
పకుఁడై యొప్పుచునుండు నట్టిహరినేఁ బ్రార్థింతు శుద్ధుండనై॥

ఉ॥ ఓ కమలాక్ష! యోవరద! యోప్రతిపక్షవిపక్షదూర! కు।
య్యో! కవియోగివంద్య! సుగుణోత్తమ! యోశరణాగతామరా।
యోకహ! యోమునీశ్వర! మనోహర! యోవిమలప్రభావ! రా।
వే! కరుణింపవే! తలపవే! శరణార్థిని నన్నుఁ గావవే!॥

శా॥ ఓ కాకుత్థ్సకులేశ! యో గుణనిధీ! యో దీనమందార నే।
నీ కోపంబున కెంతవాఁడ! జడుఁడన్! నీవేమొ భూరాజవే।
లోకాధీశుఁడ! వాదినాయకుఁడ వీ లోకంబులెల్లప్పుడున్।
నీ కుక్షిం బ్రభవించు, నుండునడగున్, నిక్కంబు సర్వాత్మకా।

శా॥ ఓ లక్ష్మీపతి! యో పురాణపురుషా! యో పుణ్యసంకీర్తనా॥
యో లోకేశ్వర! యో గజేంద్రవరదా! యోద్వారకావల్లభా
యో లీలామనుజావతారనటనా! యోకృష్ణ! యోయచ్యుతా
యోలిన్నాదు మనస్సరోవరములో నోలాడవే యో హరీ!

శా॥ నీవే తల్లివి ! నీవే తండ్రివరయన్ నీవే జగన్నాథుడౌ !
నీవే నిశ్చలబాంధవుండ వరయన్నీవే మునిస్తుత్యుఁడౌ ।
నీవే శంకరమూలమంత్రమయుఁడౌ నీవే జగత్కర్తవున్ ।
నీవేదిక్కను వారలేకద ! కడునీవారు నారాయణా !

కం॥ నీకంటె నొండెరుంగము ।
నీకంటెం బరులఁ గాననేరరు జగముల్ ।
నీకంటె నొడయఁ డెవ్వఁడు ? ।
లోకంబులకెల్ల నిఖిలలోకస్తుత్యా ! ॥

కం॥ నీలోన లేనిచోద్యము ।
లే లోకములందుఁ జెప్ప రీశ్వర ! నీటన్ ।
నేల న్నింగిని నున్నవె ? ।
నీలోఁ జోద్యంబులెల్ల నెగడు మహాత్మా ! ॥

కం॥ దిక్కులు కాలముతోనే ।
దిక్కన లేకుండగలుఁగు దిక్కులమొదలై ।
దిక్కగల లేనివారికి ।
దిక్కయ్యెడునట్టి నీవు దిక్కు ! మహాత్మా ! ॥

గీ॥ పన్నగేశ్వరశయన ! యో పద్మనాభ ! ।
యాపదుద్ధార ! మానిహృత్తాపహార ! ।
భక్తమానసభృంగ ! యో భవవిభంగ ! ।
రార నా యండనుండ నారాయణుండ ! ॥

కం॥ దీనుల కుయ్యాలింపను ।
దీనుల రక్షింప, మేలు దీవనబొందన్ ।
దీనావన ! నీకొప్పును ।
దీన పరాధీన ! దేవదేవ ! మహేశా ! ॥

ఉ॥ ఎవ్వనిచే జనించు జగ; మెవ్వనిలోపలనుండు లీనమై ।
యెవ్వనియందుడిందుఁ; బరమేశ్వరుఁడెవ్వఁడు; మూలకారణం ।

బెవ్వఁ డనాదిమధ్యలయుఁ డెవ్వఁడు సర్వము దానయైనవాఁ ।
డెవ్వఁడు వాని నాత్మభవు; నీశ్వరు నే శరణంబు వేడెదన్ ॥

కం॥ ఒకపరి జగములు వెలినిడి ।
యొకపరి లోపలికిఁ గొనుచు నుభయము దానై ।
సకలార్థ సాక్షియగు న ।
య్యకలంకుని నాత్మమూలు నర్థిఁ దలంతున్ ॥

కం॥ లోకంబులు లోకేశులు ।
లోకస్థులు తెగిన తుది నలోకంబగుఁ బెం ।
జీకటి కవ్వల నెవ్వం ।
డేకాకృతి వెలుగు నతని నే సేవింతున్ ॥

కం॥ నర్తకుతిభంగిఁ బెక్కగు ।
మూర్తులతో నెవ్వడాడు మునులుం దివిజుల్ ।
కీర్తింపనేర; రెవ్వని ।
వర్తనమొరులెరుగ; రట్టివాని నుతింతున్ ॥

గీ॥ ముక్తసంగులైన మునులు దిదృక్షులు
సర్వభూతహితులు సాధుచిత్తు
లసదృశవ్రతాఢ్యులై గొల్తు రెవ్వని
దివ్యపదము వాఁడు దిక్కునాకు

కం॥ యోగాగ్నిదగ్ధకర్ములు
యోగీశ్వరు లే మహాత్ము లొండెరుగక స ।
ద్యోగవిభాసిత మనముల ।
బాగుగ వీక్షింతు రట్టిపరము భజింతున్ ॥

కం॥ విశ్వకరు విశ్వదూరుని ।
విశ్వాత్ముని విశ్వవేద్యు విశ్వు నవిశ్వున్ ।
శాశ్వతు నజు బ్రహ్మప్రభు ।
నీశ్వరునిం బరమపురుషు నే భజియింతున్ ॥

శా॥ లావొక్కింతయులేదు; ధైర్యమువిలోలంబయ్యెఁ బ్రాణంబులున్
ఠావుల్దప్పెను; మూర్ఛవచ్చెఁ దనువున్ డస్సెన్ శ్రమంబయ్యెడిన్
నీవేతప్ప నితఃపరంబెఱుఁగ; మన్నింపందగున్ దీనునిన్ ।
రావే! ఈశ్వర! కావవే వరద! సంరక్షించు భద్రాత్మకా!

కం॥ వినుదఁట జీవులమాటలు ।
చనుదఁట చనరానిచోట్ల శరణార్థుల కో ।
యనుదఁట పిలిచిన; సర్వము ।
గనుదఁట; సందేహమయ్యెఁ గరుణావార్ధీ!

సీ॥ కలుగఁడే నాపాలి కలిమిసందేహింపఁ
గలిమిలేములు లేక కలుఁగువాఁడు ।
నాకడ్డపడరాఁడె సకలసాధువులచేఁ
బడిన సాధుల కడ్డపడెడువాఁడు ।
చూడఁడే నా పాటు చూపులు చూడక ।
చూచువారలఁ గృపఁజూచువాఁడు ।
లీలతో నా మొఱాలింపఁడే మొఱగుల ।
మొఱలెఱుంగుచుఁ దన్నుమొఱగువాఁడు ।

గీ॥ అఖిలరూపముల్ దనరూపమైనవాఁడు ।
ఆదిమధ్యాంతములు లేక నడరువాఁడు ।
భక్తజనముల దీనులపాలివాఁడు ।
వినఁడె! చూడఁడె! తలఁపడె! వేగరాఁడె! ॥

సీ॥ భవము దోషంబు రూపంబు కర్మంబు నా ।
హ్వాయములు గుణము నెవ్వనికి లేక ।
జగములు గలిగించు సమయించుకొఱకునై ।
నిజమాయ నెవ్వఁ డిన్నియునుదాల్చు ।
నా పరేశునకు ననంతశక్తికి బ్రహ్మ ।
కిద్ధరూపికి రూపహీనునకును ।

జిత్రచారునికి సాక్షికి నాత్మరుచికిని ।
బరమాత్మునకుఁ బరబ్రహ్మమునకు ।

॥ మాటలను నెఱుకల మనముల జేరంగఁ ।
గానిశుచికి సత్యగమ్యుఁ డనుచు ।
నిపుణుఁడైనవాని నిష్కర్మతకు మెచ్చు ।
వానికే నొనర్తు వందనములు ॥

॥ శాంతున కపవర్గ సౌఖ్యసంవేదికి ।
నిర్వాణభర్తకు నిర్విశేషు ।
నకు ఘోరునకు గూఢునకు గుణధర్మికి ।
సౌమ్యున కధికవిజ్ఞానమయున ।
కఖిలేంద్రియద్రష్ట కధ్యక్షునకు బహు ।
క్షేత్రజ్ఞునకు దయాసింధుమతికి ।
మూలప్రకృతి కాత్మమూలున కఖిలేంద్రి ।
యజ్ఞాపకునకు దుఃఖాంతకృతికి ।

౨॥ నెఱి నసత్యమనెడి నీడలో వెలుఁగుచు ।
నుండు నెక్కటికి మహోత్తరునకు ।
నిఖిలకారణునకు నిష్కారణునకు న ।
మస్కరింతు నన్ను మనుచుకొఱకు ॥

౩. సర్వాగమామ్నాయ జలధికి నపవర్గ ।
మయునికి నుత్తమమందిరునకు ।
సకలగుణారణిచ్ఛన్న బోధాగ్నికిఁ ।
దనయంతరాజిల్లు ధన్యమతికిఁ ।
గుణలయోద్దీపిత గురుమానసునకు సం ।
వర్తితకర్మ నిర్వర్తితునకు ।
దిశలేని నాబోటి పశువుల పాపంబు ।
లడఁచువానికి సమస్తాంతరాత్మ ।

ఆ॥ దైవె వెలుంగువాని కచ్చిన్నునకు భగ।
వంతునకుఁ దనూజ, పశు, నివేశ।
దార సక్తులైన వారి కందఁగరాని।
వాని కాచరింతు వందనములు॥

సీ॥ కంజాక్షునకుఁగాని కాయంబుకాయమే।
పవనగుంభితచర్మ భస్త్రిగాక।
వైకుంఠుఁ బొగడని వక్త్రంబు వక్త్రమే?।
ఢమఢమధ్వనితోడి ఢక్కగాక।
హరిపూజనములేని హస్తంబు హస్తమే।
తరుశాఖనిర్మిత దర్విగాక।
కమలేశుఁ జూడని కన్నులు కన్నులే।
తనుకుడ్యజాల రంధ్రములుగాక!

ఆ॥ చక్రిచింతలేని జన్మంబుజన్మమే।
తరళసలిల బుద్బుదంబుగాక।
విష్ణుభక్తిలేని విబుధుండు విబుధుఁడే।
పాదయుగముతోడి పశువుగాక॥

సీ॥ కమలాక్షు నర్చించు కరములు కరములు।
శ్రీనాథు వర్ణించు జిహ్వ జిహ్వ।
సురరక్షకునిఁ జూచు చూడ్కులు చూడ్కులు।
శేషశాయికి మ్రొక్కు శిరము శిరము।
విష్ణునాకర్ణించు వీనులు వీనులు।
మధువైరిఁ దవిలిన మనము మనము।
భగవంతు వలగొను పదములు పదములు।
పురుషోత్తమునిమీఁది బుద్ధి బుద్ధి।

తే॥ దేవదేవునిఁ జింతించు దినము దినము।
చక్రహస్తునిఁ బ్రకటించు చదువు చదువు।

కంబిసీధవుఁజెప్పెడి గురుఁడు గురుఁడు।
తండ్రి! హరిఁ జేరుమనియెడి తండ్రి తండ్రి!॥

చ॥ హరిభజియించు హస్తములుహస్తము; లచ్యుతుఁగోరి మ్రొక్కుత
చ్ఛిరముశిరంబు; చక్రిధరుఁజేరినచిత్తము చిత్తమిందిరా।
వరుఁగను దృష్టిదృష్టి; మురవైరి నుతించెడు వాణి వాణి; య
త్పురుకథలానుకర్ణములు కర్ణములై విలసిల్లుఁ బోభువిన్॥

శా॥ శ్రీమద్భానుసహస్రమండల విభాసీ! సచ్చిదానందమూ।
ర్తీ! మాయాకల్పితాఖిల జగచ్ఛ్రేణీ దయాంభోనిధీ!
స్వామీ! నీ మహిమంబు లానిగమముల్ వర్ణింపలేవన్నచో।
నే మూఢాత్ముఁడ! నేమెరుంగుదును తండ్రీ! భక్తచింతామణీ!

కం॥ నీ పాదకమలసేవయు।
నీ పాదార్చకులతోడి నెయ్యమును నితాం।
తాపారభూతదయయును।
తాపసమందార! నాకు దయసేయగదే!॥

మ॥ అరవిందాసనుఁ డాదిగాఁగఁ దృణపర్యంతంబు నీవై మహా।
త్తరమౌ మాయకు లోకజాలముల మిథ్యాకీర్తిగావించి యు।
ద్ధరతన్ ప్రాణుల బొమ్మలట్లు క్షణమాత్రంజేసి యాడించు నీ
శరణేఁగోరితి నెట్లు బ్రోచెదవో! యీశా! ఆర్తరక్షామణీ!॥

ఉ॥ వేదవధూశిరోమహిత వీధులఁ జాలనలంకరించు మీ।
పాదసరోజయుగ్మము శుభస్థితి మా హృదయంబులందు ని।
త్యోదితభక్తిమై తగిలియుండు నుపాయమెరుంగఁబల్కు; దా।
మోదరభక్త దుర్భవపయోనిధితారణ! సృష్టికారణా!॥

మ॥ చెలివై, చుట్టమవై, మనస్థితుఁడవై, చిన్మూర్తివై, యాత్మవై।
వలనై, కోర్కెలపంటవై, విభుఁడవై, వర్ధిల్లు నిన్నొల్ల కే।
పలువెంటంబడి లోక మర్కట! వృథా బద్ధాశమైపోయెడిన్।
నిలువన్నేర్చునె! హోమరాశిఁగనియు నిర్భాగ్యుఁడంబత్మయా

## * శ్రీ మహాలక్ష్మ్యష్టకం.

శ్లో॥ నమస్తేఽస్తు మహామాయే శ్రీపీఠేసురపూజితే। శంఖచక్రగదా హస్తే మహాలక్ష్మ్మినమోఽస్తుతే। నమస్తేగరుడారూఢే డోలాసుర భయంకరి । సర్వపాపహారేదేవి మహాలక్ష్మ్మి నమోఽస్తుతే। సర్వజ్ఞే సర్వవరదే సర్వదుష్ట భయంకరి।సర్వపాపహారే దేవి మహాలక్ష్మ్మి నమోఽస్తుతే। సిద్ధిబుద్ధిప్రదేదేవి భుక్తిముక్తిప్రదాయిని। మంత్రమూర్తే వరాదేవి మహాలక్ష్మ్మి నమోఽస్తుతే। ఆద్యంతరహితేదేవి అద్యశక్తిమహేశ్వరి। యోగజ్ఞేయోగసంభూతే మహాలక్ష్మ్మి నమోఽస్తుతే।స్థూలసూక్ష్మ్మమహారౌద్రే మహాశక్తే మహోదరే। మహాపాపహారేదేవి మహాలక్ష్మ్మి నమోఽస్తుతే।పద్మాసనస్థితే దేవి పరబ్రహ్మస్వరూపిణి। పరమేశి జగన్మాత ర్మహాలక్ష్మ్మి నమోఽస్తుతే।శ్వేతాంబరధరే దేవి నానాలంకృతభూషితే। జగద్ధితే జగన్మాత ర్మహాలక్ష్మ్మి నమోఽస్తుతే। మహాలక్ష్మ్యష్టకం స్తోత్రం యః పఠే ద్భక్తిమాన్నరః సర్వసిద్ధి మవాప్నోతి రాజ్యం ప్రాప్నోతి సర్వదా। ఏకకాలే పఠేన్నిత్యం మహాపాపవినాశనం। ద్వికాలం యః పఠేన్నిత్యం ధనధాన్యసమన్వితః। త్రికాలం యః పఠేనిత్యం మహాశత్రువినాశనం। మహాలక్ష్మ్మి ర్భవేన్నిత్యంప్రసన్నా వరదా శుభా॥



# చూర్ణికలు

: శ్రీరామ స్తోత్రం :

శ్రీ మదఖిలాండకోటి బ్రహ్మాండ భాండతండ । కరండమండలశాం తోద్దీపిత కలనిర్గుణా తీత సచ్చిదానందపరాత్పర, తారకబ్రహ్మా హ్వాయ దశదిశ ప్రకాశం, సకలచరాచరాధీశం॥

కమలసంభవ శచీధవ షణ్ముఖ నిఖిలబృందారక బృందవంద్య మాన సంధీప్తదివ్యచరణారవిందం శ్రీ ముకుందం॥

దుష్టనిగ్రహ శిష్టపరిపాలనోత్కట, కపటనాటకసూత్ర చరిత్రాది బహువిధావతారం శ్రీ రఘువీరం॥

కౌసల్యాదశరథ మనోరథ మహదానంద కందళిత నిర్బాధక్రీడా విలోలన శైశవం శ్రీ కేశవం॥

విశ్వామిత్రయజ్ఞ విఘ్నకారణోత్కట, తాటకాసు బాహుబాహు విదళన, బాణప్రవీణ కోపపారాయణం శ్రీమన్నారాయణం॥

నిజపాదజలజ రజఃకణస్పర్శ శిలారూప శాపవిముక్త గౌతమసతీ వినుతం. మహీధవం శ్రీ మాధవం॥

ఖండేందుధర ప్రచండకోదండ ఖండనోద్దండ దోర్దండకౌశికలోచ నోత్సాహ జనకచక్రేశ్వర, సమర్పిత సీతావివాహోత్సవానందం శ్రీ గోవిందం॥

పరశురామ భుజాఖర్వగర్వ నిర్వాపణతానుగత రణవిజయవర్ధిష్ణుం శ్రీ విష్ణుం॥

పితృవాక్యపరిపాలనోత్కట జటావల్కలోపేత సీతాలక్ష్మణ సహిత మహితరాజ్యాధిమత ధృఢవ్రతకలిత ప్రయాణరంగగంగా వతరణ సాధనం శ్రీ మధుసూదనం॥

భరద్వాజోపచార నివారితశ్రమక్రమ నిరాఘాట చిత్రకూట ప్రవేశక్రమం, శ్రీ త్రివిక్రమం॥

జనకవియోగశోకాకులిత భరతశత్రుఘ్న లాలనాన్వకూల భరత

పాదుకప్రదాన, సుధానిర్మితాంతఃకరణ, దుష్టచేష్టాయమాన కూర్ర కాకాసుర గర్వోపశమనం శ్రీ వామనం॥
దండకాగమన విరోధక్రోధానల జ్వాలాజలధరం శ్రీధరం॥
శరభంగ సుతీక్ష్ణాత్రి దర్శనాశీర్వాద నిర్వ్యాజ కుంభసంభవ కృపాలబ్ధ మహాదివ్యాస్త్ర సముదయాంచిత ప్రకాశం శ్రీ హృషీకేశం॥
పంచవటీతటీ సంఘటిత విశాలపర్ణశాలా గతశూర్పణఖా నాశికాచ్ఛేదన, మానావబోధన, మహాహవారంభణ, విజృంభణ, రావణనియోగ మాయామృగ సంహారకార్యార్థలాభం శ్రీ పద్మనాభం॥
రాత్రించరవర వంచనాకృత సీతాన్వేషణ, రథపంక్తి రథక్షోభ శిథిలీకృత కుక్షిజటాయుర్మోక్షణ, బంధుప్రియావసాన నిర్బంధ వక్త్రోదర శరీరనిరోధరం శ్రీ దామోదరం॥
శబర్యుపదేశం పంపాతట, హనుమత్సుగ్రీవ సంభాషిత బంధురాద్భంధు, దుందుభీకళేబరోత్పతన సప్తసాలాచ్ఛేదన, వాలీవిదారణ, ప్రపన్న సుగ్రీవ సామ్రాజ్య సుఖమర్షణం శ్రీ సంకర్షణం॥
సుగ్రీవాంగద నీల జాంబవత్పవన కేసరిప్రముఖ నిఖిల కపినాయకాసేనసముదయార్చిత దేవం శ్రీ వాసుదేవం॥
నిజదత్తముద్రికా జాగ్రత్సముగ్రాంజనేయ వినయవచనాంబుధీలంఘిత, లంఖిణీ ప్రాణోల్లంఘన, జనకజాదర్శన, అక్షయకుమారమారణ లంకాపురీదహన, తత్ప్రతిష్ఠిత సుఖప్రసంగ ధృష్టద్యుమ్నం శ్రీ పద్యుమ్నం॥
అగ్రజోదగ్ర మహోగ్ర నిగ్రహపలాయమానావమాననీయ నిజ శరణాగ్రగణ్య పుణ్యోదయ, విభీషణాభయప్రదాన నిరుద్ధం శ్రీ మదనిరుద్ధక॥
అపారలవణ పారావార సముజ్జృంభితోత్కరణ గర్వనిర్వాపణ, దీక్షాసమరం, సేతునిర్మాణ ప్రవీణాఖిల తరుచరోత్తమం శ్రీ పురుషోత్తమం॥

నిస్తుల ప్రహస్త కుంభకర్ణేంద్రజిత్కుంభాగ్ని వర్ణాతికాయ, మహోదర, మహాపార్శ్వాది దనుజతనుఖండనాయమాన కోదండ గుణశ్రవణశోషణ హతశేషరాక్షస వ్రజం శ్రీ మదధోక్షజం॥
అకుంఠితరణోపకంఠ దనుజకంఠీరవ కంఠలుంఠనాయమాన జయ సింహం శ్రీ నారసింహం॥
దశగ్రీవానుజ పట్టభద్రిత్వాశక్త్య, విభవలంకాపురీస్ఫురణ సకల సామ్రాజ్య సుఖోచ్యుతం శ్రీమదచ్యుతం॥
సకలసురాద్భుత ప్రజ్వలిత పావకముఖపూతాయమాన, సీతాలక్ష్మణానుగతమహనీయ పుష్పకాధిరోహణ, నందిగ్రామస్థితభ్రాతృ భ్రియుతజటావల్కలవిసర్జనాంబర భూషణాలంకృత శ్రేయోభివర్ధనం శ్రీజనార్దనం ॥
అయోధ్యానగర పట్టాభిషేక విశేషమహోత్సవనిరంతరదిగంత విశ్రాంత హీరకర్పూరపయః పారావార, పారదవాణి కుందేందు మందాకినీ చందనసురధేను శరదంబుదాళి, ధరదంభోళి, శతధారా ధావళ్య, శుభకీర్తిచ్ఛటాంతర పాండురీపూత సభావిభ్రాజమాన నిఖిలభువనైకయశస్సాంద్రం శ్రీమదుపేంద్రం ॥
భక్తజనసంరక్షణ, దీక్షా కటాక్ష శుభోదయసముద్ఘురీం శ్రీహరిం॥
కేవవాది చతుర్వింశతినామగర్భసందర్భిత నిజకథాంగీకృతమేధావరిష్ణుం శ్రీకృష్ణం ॥
సర్వసుపర్వ పార్వతీహృదయకమలతారక బ్రహ్మనామం సకల పూర్ణకామం, భవతరుణానుగుణసాంద్రం, భవజనితభయోచ్ఛేద మచ్ఛిద్రవిచ్ఛిద్రం. భక్తజనమనోరథోఽగీంద్రం, భద్రాచల రామభద్రం రామదాసప్రసన్నం, భజేహం, భజేహం భజేహం॥

---

## • హాటకేశ్వర స్తోత్రం •

ఓం నమోఽస్తు శర్వశంభో ! త్రినేత్ర ! చారుగాత్ర ! త్రైలోక్య నాథ ! పశుపతే ! దక్షయజ్ఞవిధ్వంసకారక ! కామాంగనాశ !

ఘోరపాపప్రణాశన ! మహాపురుష ! మహోగ్రమూర్తే! సర్వసత్వ క్షయంకర ! మహేశ్వర ! త్రిశూలధర!స్మరారే ! గుహాధామన్ ! దిగ్వాస ! మహాచంద్రశేఖర ! జటాధర ! కపాల మాలావిభూషిత శరీర ! వామచక్షు క్షుభితదేవ ! ప్రజాధ్యక్షభగాక్షో క్షయంకర ! భీమసేననాధ ! పశుపతే ! కామాంగదాహిన్ ! చత్వరవాసిన్ ! శివ మహాదేవ ! ఈశాన ! శంకర ! భీమభవవృషధ్వజ, కలభ ప్రౌఢ ! మహానాట్యేశ్వర ! భూతిరతి అవిముక్తికరుద్ర ! రుద్రేశ్వర ! స్థాణో ! ఏకలింగ కాళిందీప్రియ, శ్రీకంఠ, అపరాజితరిపు భయంకర, సంతోషపతే,వామదేవ, అఘోర, తత్పురుష, మహాఘోర, అఘోరమూర్తే శాంత, సరస్వతీకాంత, సహస్రమూర్తే, మహోద్భవ, విభో, కాలాగ్నే, రుద్ర, రౌద్రహర,మహీధరప్రియ సర్వతీర్థాదివాస,హంసకామేశ్వర కేదార అధిపతే, పరిపూర్ణ,ముచుకుంద,మధునివాస, కృపాణపాణే, భయంకర, విద్యారాజ, సోమరాజ,కామరాజ, మహీధరరాజ కన్యాహృదబ్జవసతే, సముద్రశాయిన్, గయాముఖగోకర్ణ, బ్రహ్మయోనే, సహస్రవక్త్రాక్షచరణ, హాటకేశ్వర నమస్తే నమస్తే నమః ॥



# శ్రీ శివదండకం

: శ్రీ ముదిగంటి నృసింహశాస్త్రికృతం — దండకసప్తకం :

శ్లో॥ కుందేందుధవళాకారం కందర్పమదభంజనం ।
వందితామరసందోహం వందేహం పార్వతీపతిం ॥

శ్రీ మన్మహాదేవదివ్య ప్రభావా భవా భక్తమందార సద్ధీర కర్పూర
పాటీర కుందేందునీహార డిండీర కల్పద్రుమాకల్ప భాస్వచ్ఛరీరా
బుధాధార కోట్యబ్జబాణోపమాకార పాథోధితూణీర గోత్రేశ
పుత్రీకళత్రా త్రినేత్రా పవిత్రాద్భుతానంత కళ్యాణచారిత్ర
యక్షేశమిత్రా సమస్తామరస్తోత్రపాత్రా హరా శంకరా దివ్య
గంగాధరా భక్తసంగాదరా శ్రీకరా చంద్రమౌళీ లసన్నేత్రత్రి
యీభూత వహ్నీందుహేళీ సదానమ్రపంకేజ నేత్రాద్యనేక
నాగేంద్రపాళీ విరాజ త్రిశూలీ కపాలీ దయాశాలి కంకాళ
మాలీ సరోజాతపుత్రోరు గర్వప్రహార పురారీ మఘారీ జటా
జూటధారీ శివా వామదేవ మహాదేవ దేవాదిదేవా సితగ్రీవ
సాంబా ధరాధీశ పుత్రీకరాబ్జావలంబా వినవ్యార్తితోగ్రాసురా
డంబ మానీంద్ర హృచ్చారు కాసారకాదంబ యీశా గిరీశా
మహేశా దినాధీశకోటిప్రకాశా వియత్కేశ సర్వేశ ధాత్రీశతాంగా
మహోత్తుంగ గోరాట్తురంగా కరాంభోరుహాంచత్కురంగా సదా
నంగ భస్మాంగలిప్తాంగ పీయూషసారప్రసంగ జటాజూటరంగ
న్మహోత్తుంగ గంగాతరంగా శితాంగా లసత్కృత్తివాసా గిరీం
ద్రాత్మజా మానసోల్లాస కైలాస భూభృన్నివాసా సుధాధామ
కాంతిస్ఫురన్మందహాసా సదా దాస వర్గాపవర్గ ప్రదాభాష
తారుణ్యలావణ్య కాంత్యుజ్వలోద్ధారకారుణ్యకాంతావళీ హృద్వి
లాసా నిరస్తావనీదేవ హత్యాజనేకోగ్రపాపా చిదానందరూపా
జగద్దీప బాణీకృతశ్రీప హేమాద్రిచాపా పరంధామ దోర్వీర్య
గర్వోగ్రశార్దూలమత్తేభ ముఖ్యాసురగ్రామ సంగ్రామభీమాసము

నిష్ఠ్రదదారిద్ర్యవిద్రావణాక్షుద్ర భద్రపదన్నామశాంతాద్యనంతో
త్తమ శ్రీ గుణోద్దామ పీయూషభుక్సార్వభౌమా మహాకాల లీలా
కృతానంత బ్రహ్మాండజాలా సుశీలా జగజ్జాల సంపాలన ప్రౌఢ
శీలా శివాలోల దిక్చేల ఫాలాక్ష శర్వా కపర్దీ పినాకీ విరూపాక్ష
మృత్యుంజయా అంధకప్రాణ సంహారకా నిన్ను నిండారకొండాడ
శేషాహిభాషాపతుల్ జాలరేరన్న నేనెంతవాడన్ మహోన్మత్తుడన్
కిల్బిషాయత్తచిత్తుండ నో దేవ లీలంజగజ్జాల సంసృష్టియున్ పుష్టి
యున్ నష్టియున్ జేయ వాగీశ లక్ష్మీశ రుద్రాఖ్యభద్రాకృతుల్
పూను సర్వేశ్వరున్నిన్ను నిష్ఠాగరిష్ఠాత్ములై నిష్ఫలత్యంతసద్భక్తి
సంయుక్తులై గొల్చి వైకుంఠ కైలాసధామంబులన్ నిల్చి
సామీప్య సారూప్య సాయుజ్యముల్ గాంతురో స్వామి
యధ్యాత్మకుల్ కొందరాద్యం తహీనున్ నిరాకారు నిర్ద్వంద్వు
నిత్యుం నిరాలంబు నిన్నిర్వికారున్ పరున్ సచ్చిదానందమూర్తిన్
పరంధాము నాత్మన్ విలోకించి సుజ్ఞానసప్తార్చికీలావళీ దగ్ధకర్మాళులై
ముక్తులౌచుందురో దేవ నిన్ బొత్తిగా నెత్తరిన్ చిత్తవాక్కాయ
కర్మంబులన్ శక్తి దాసక్తి భావింప సేవింప పూజింపలేనట్టి మూఢా
త్ములంతంబునన్ వింతగా కింకరానీతులై పంకజాతాప్తపుత్రాజ్ఞచే
దుర్గతిన్ యాతనాన్వీతులై భీతులై కొంతకాలంబు తద్యాతనంబొంది
తూపిమ్మటన్ గ్రమ్మరన్ మాతృగర్భానుసారంబుగా ధాత్రి
జనించి దారార్థ పుత్రేషణాసక్తులై సంతతార్థాద్యనోద్యుక్త
దుర్వృత్తులై భీషణానల్పదోషంబులన్ సల్పి తత్తన్ మహాత్క్రూర
కర్మంబులన్నిట్టుచున్ నీదరింజేరగాలేక చక్రక్రియం బ్రామ్య
మాణత్వముంగాంతురో దేవదేవా కృతాంతుండతిక్రోధతామ్రే
క్షుడౌచున్ సుశాంతున్ భవద్భక్తియుక్తున్ మృకండాత్మజుంజేరి
తత్ప్రాణసంహారణాయత్తుడై మత్తుడై యుండ నో సాంబ శంభో
మహాదేవ మాంపాహి మాంపాహి యంచాత్మలో వేడగా నోడనే
వచ్చి యయ్యంతకున్ శిక్షగావింపవే పెంపడంగింపవే మృత్యువున్
ద్రుంపవే మత్తమాతంగ ముఖ్యాసురస్తోమమున్ నింగికుప్పొంగుచు

న్వాచ్ఛనాభీలకోలాహలోద్వేల హాలాహలోదగ్ర కీలాకలాపంబు నోర్కుమ్మడిన్ దంబుమీరంగ జంబూఫలప్రక్రియన్ గుక్కనన్ మ్రింగవే తుంటవిల్కానిను మేల్బంటునిన్ కంటిమంటన్ విదారింపవే దక్షునిన్ దుర్నయాధ్యక్షు శిక్షింపవే నిండు గాండీవ కోదండపాండిత్యముద్దండత న్జూపి సంతోషివై పాశుపతనామకాస్త్రమ్మొసంగి విజయునిన్ మెచ్చవే విశ్వవిశ్వంభరా చక్రమింపొంద సుశ్చంద నంబై చెలంగన్ తురంగంబులై వేదముల్ చెంగలింపన్ రథాంగంబులై చూన్ పతంగాబ్జవైరుల్ వెలుంగన్ భుజంగేంద్ర మౌర్వీసమాంచత్సువర్ణాద్రి చాపంబు చేబూని యానల్వ చెల్వార సారథ్యమున్ జేయ నారాయణాస్త్రంబు చేతన్ పురంబుల్ ధరం గూల్పవే నిల్పవే భూరిబ్రహ్మాండ భాండంబులం బొజ్జలో। నోజ్జవై దెల్పవే మానులుప్పొంగ సత్తత్త్వమున్ మిక్కిలిన్ జక్కగా జుక్కలన్ లెక్కగావింపవచ్చున్ భవచ్చిత్ర చారిత్రముల్ దెల్పశక్యంబె క్రూరాత్ములై నట్టి దశగ్రీవ బాణాద్యనేకాసురుల్ తావకాంఘ్రిద్వయాబ్జంబు లర్చించుటం గాదె త్రైలోకవిఖ్యాత బాహాబలాధిక్య ముఖ్యామితైశ్వర్య భోగానురాగంబులం జెంది కైవల్యమున్ బొందరే యింకసన్మౌధులన్ సాధులన్జెప్ప గానేల యోయప్ప యప్పాటునైనన్ భవద్భక్తియుక్తుల్ మహద్భక్తిముక్తిప్రియుక్తుల్ కదా యంచు యాత్మన్ విచారించి నిండారమేల్ మల్లెపూదండగా దండకంబున్ సమర్పించితిన్ దప్పులేమున్న నొప్పుగా గాంచి మత్పూర్వజన్మార్జితాశేషదుష్కర్మజాలంబు నిర్మూలముం జేసి మద్దేహికాపాత్త బాహ్యాంతరస్థాఘసంఘాతముల్ బాపి సన్నన్ విపన్నున్ ప్రపన్నున్ ప్రసన్నుండవై బ్రోవు మో ధూర్జటీ దీనబంధో జగన్నాథ కారుణ్యసింధో నమస్తే నమస్తే నమస్తే నమః

శ్రీ శివదండకం సంపూర్ణం.

: శ్రీ రా మ ద ం డ క ం :

శ్లో॥ కౌసల్యాగర్భసంభూతం । మైథిలీ ప్రాణవల్లభం ।
కోటికంజ శరాకారం । శ్రీరామం ప్రణమామ్యహం ॥

శ్రీ మత్సరోజాతనేత్రా మహచ్చిత్రచారిత్ర ధాత్రీశ గోత్రారిముఖ్యా
మర స్తోత్రపాత్రా హృషీకేశ కోట్యంబుజాప్తప్రకాశా రమాధీశ
ధ్యామోదితా భక్తవర్గాదరా తొల్లి నీవెల్ల పాల్వెల్లిలో తెల్ల దీవి
న్నీరాజిల్లు జాబిల్లి రామేడలో వేడుకన్ ప్రోడవై లచ్చికిన్
ముచ్చటల్ దెల్పుచున్ భోగిభోగానసక్తుండవై యుండ నీ దండ
కంభోజ సంభూతజంభారి ముఖ్యామరుల్ జేరి వేవేలు జేజేలుగా
వించి సద్భక్తి దైవారకై వారముల్సల్పి దేవ దశగ్రీవ కృద్ఘోర
కృత్యంబులన్ నిత్యదుఃఖంబులన్గుందు మాకందు దూలించి పాలిం
చుమన్నన్ ప్రసన్నుండవై వేల్పులానందమున్జెంద పొల్పొంద ధా
త్రిన్ జగన్నేత్ర గోత్రాబ్ధి తారాకళత్రుండవై యా దశస్యందనా
ఖ్యావనీజానకిన్ దేవసన్మానికిన్ బట్టివై పుట్టి చెన్నొంది గారాబ
మేపార సంపూర్ణవిద్యాగరిష్ఠుండవై యర్థి గాధేయసత్రావనార్థం
బు సౌమిత్రియున్నీవు పిత్రాజ్ఞ చంచద్ధనుష్పాణులై ప్రోజ్వలత్తూణు
లై బద్ధగోధాంగులీత్రాణులై నెమ్మినమ్మౌనిరాడ్వెంట నేతేర
నాదారికడ్డంబుగా జేరి ఘోరాకృతిన్మీరి హోరాటకారాటమున్
సల్పునైశాటకన్ తాటకన్ పాటవంబేర్పడం గీటడంగింపవే
దూరింపవే యుంపకోలన్ ధరోత్తుంగదేహున్ సముద్దీర్ఘబాహున్
సుబాహున్ లసన్మారుతాస్త్రంబునన్ నీచు మారీచు మున్నీటి
మధ్యంబునన్ మూర్ఛ మున్గింపవే యింపుసొంపార యజ్ఞాంతరా
యంబు బెన్వ్రీంతగా నంత మొందింపవే చేయవే శాపమోక్షంబు
లక్షణసౌభాగ్య సాకల్యకాహల్యకున్ పాదరేణు ప్రభావంబుచే
సా విదేహావనీనాయకా స్థాన సంస్థాపిత స్థాణుబాణాసనం బిక్షు
ఖండంబు ఖండించవే దండమున్ బోలె ఖండించి సీతాకరాగ్రావ
లోత్సాహచేతస్సమేతుండవై రాకుఠారోగ్ర ధారాహత క్షత్రి

యోధాముడౌ రాముడాదారిలో జేరినిన్దూరుచున్ భైరవాలాపముల్
బల్కు నవ్వీరునిన్ గర్వనిర్మూలునిన్ జేయవే నూత్నరత్నప్రభా
విస్ఫురద్గోపురంబౌ యయోధ్యాపురంబుం బ్రవేశించి ధాత్రీసరోజ
నేత్రి సుపుత్రీప్రియుక్తుండవై నన్వర్త దాసీప్రబోధార్తయై ధూ
ర్తయై భర్తచే మున్వర ద్వంద్వముం జెందియున్నందునన్ కైక
లోకైకమాన్యుండవౌ నీకు పట్టాభిషేకాంతరాయంబు కాంతార
వాసప్రయాసంబు గావింప గాంభీర్యధుర్యుండవై తండ్రిసత్యంబు
పాలించుటన్ తమ్మునిన్ రాజ్యమేలించుటన్ నీతిగా నాత్మలో
నెంచి సౌమిత్రియున్ ధారుణీపుత్రియున్ వెంటరా నంతటన్
భూతిరుద్రాక్షమాలల్ జడల్ నారచీరల్ గడున్ భాసిలన్ బాస
వాశ్వేసము న్బూని గంగానదీతీరమందున్ భవత్పాదపంకేజసంద
ర్శనానందబృందున్ గుహున్ సత్యధర్మావహున్ గాంచి ప్రాంచ
ద్భరద్వాజ పుణ్యాశ్రమస్థాన సంస్థాయివై చిత్రకూటాచలంబందు
గొన్నాళ్లు వర్తింప యుష్మద్వియోగ ప్రభూతార్తినంతన్ దశ
స్యందనుం డంతమున్జెంద కైకాతనూజాతు డత్యంత చింతాకుల
స్వాంతుడై చెంతకేతెంచి నిన్విశ్వవిశ్వంభరా భారమున్బూన
బ్రార్థించినన్ సాదరాలోకివై పాదుకాయుగ్మ మాసోదరాధీనము
జ్జేసి నెమ్మి న్నాతమ్మునిన్ గ్రమ్మరన్బంపి యా పిమ్మటన్ కేసరీ
కాసర వ్యాఘ్రభల్లూక భూదార రక్షశ్శరణ్యంబువల్లీ మతల్లీమహా
ద్భూజరాజీలసత్పుంజ పుంజాగ్రగణ్యంబునన్ దండకారణ్యమున్జేరి
బాహాబలశ్రీసనాథున్ విరాధున్ యమాధీనమున్ జేయవే చుప్ప
నాతిన్ కనచ్ఛాతిహేతిన్ శ్రుతి ఘ్రాణములు ద్రుంచి వైరూప్యమొం
దించినన్ భీమసంగ్రామకేళీ వికాసుల్ జనస్థానవాసుల్ నరాదుల్
ఖరాదుల్ గదాపట్టిశప్రాస కౌక్షేయక ప్రాస ముఖ్యాయుధోపేతులై
సైన్యసుస్ఫీతులై దాక నమ్యాత్మక దోర్విక్రమక్రీడ నుద్దండకోదండ
పాండిత్యమేపార ఖండాంశుగాసారనిర్మగ్నులం జేసి వేద్రుంచి నిశ్శేష
తన్మొందింపవే రావణ ప్రేరితుండౌచు మారీచుడన్నీచుడేతెంచి

మాయాకురంగాకృతి న్బూని మేల్రంగుఁ హొంరంగుఁ జెలంగఁ మెలంగఁ ధరాపుత్రికిఁ గోర్కెలీడేర్ప నాలేడి వెన్నాడి మేల్వాఁడి బాణమ్మున న్ద్రుంప నేణాకృతిన్వాఁడి హాలక్ష్మణాయంచు వాఁడీల్గ నానాద మత్యంత ఖేదంబొనర్ప న్ధరాపుత్రి యాలక్ష్మణు న్నిసమక్షంబు వేజేరబుచ్చఁ దశగ్రీవుఁడాలోన సీతాసతింగొంచు లంకాపురింజేరి శంక సుమిత్రాత్మజుంగూడి తూర్ణంబుగా పర్ణశాలం బ్రవేశించి యా జానకిన్గానకఁ దీనచిత్తుండవై కుందుచుఁ గందరంబుల్ ధరంబుల్ లతామందిరంబుల్ సరంబుల్ ఝురంబుల్ గిరుల్ వెద్కుచుఁ రావణోగ్రాస్త్ర విచ్ఛేదితోత్తుంగకాయుఁ జటాయున్నిరీక్షించి యా పక్షికిఁ మోక్షలక్ష్మీ కటాక్షంబు గల్గించి యంతఁ మదాంధుఁ గబంధుఁ కృతాంతతాతిథిఁ జేసి సత్కైరవేందీవరాంభోజ కల్హారవారస్ఫుర త్సౌరభాగార పంపాసరస్తీరమున్జేరి స్వామిజారివాక్యానుసారంబుగా మైత్రితో మైత్రి గావించి వాలిన్కనత్కనకమాలిఁ దశగ్రీవ దుర్గర్వనిర్మూలి నేకోగ్రకాండంబునం జెండవే భానుమత్సూనుతికిఁ భవ్యవిఖ్యాతికిఁ గీశరాజ్యాభిషేకంబు గావించినఁ బాసనై సద్బలోపేతులఁ గోతులఁ భూసుతాన్వేషణార్థంబు పుత్తెంచుకాలంబునఁ బుద్ధిమంతున్ హనుమంతువీక్షించి నీ వుంగరం బానవాలిచ్చి యామ్యప్రదేశంబు వెన్కన్నియోగింప నయ్యంజనాపుత్రుం డభ్రంకషోత్తుంగ రంగన్మహోత్తాల కల్లోలమాలాకులాభీల పాథోనిధిన్ దాటి సూటిన్సువేలాద్రిపై నిల్చి నిశ్శంకగా లంకలోఁ జేరంజొచ్చి యా రాత్రి యంగుష్టమాత్ర ప్రమాణాంగుడై కోటలన్పేటల న్మేటి పూదోటలన్ మేడలన్వాడల న్మందిరంబుల్ మహాకందరంబుల్ పరీక్షించి లంకాపురోద్యాన మధ్యప్రదేశంబునన్ క్రూరనక్తంచరీవార ప్రాకారమధ్యంబునందున్న సీతన్ త్రిలోకైకపూతన్విలోకించి శోకంబువారించి నీ భద్రచారిత్ర మాద్యంతమున్దెల్పి [illegible]ముద్రికారత్న మర్పించి యమ్మేటి యా రక్కసుల్తోటి పోరాట

కై యుద్యాటతోటన్ సముత్పాటనం బాచరింపన్ నిలింపద్విషా ధీశుడాత్మన్ క్రుధావేశుడై క్షోభనశ్వాది రక్షోబలాధ్యక్షులన్ బంపినన్ గుంపులై గూడి యొక్కుమ్మడిం దాక సమ్మూకలం గాంచి మేన్పెంచి కాలాంతకాకారుడై శైలరాడ్ధీరుడై కాలపాశోపమ స్థూలవాలమ్మునన్ భిండివాలమ్మునన్ గాలకేలన్ మదోత్తుంగమా తంగపాళిన్ మహద్ఘోటకశ్యందనోద్భటాళిన్ విదారించి తత్సై న్యము న్ముక్తచైతన్య మొందించి వీరాట్టహాసప్రదీప్తాస్యుడై యక్ష నిన్ దుర్నయాధ్యక్షునిన్ ముష్టిఘాతంబునన్ మృత్యువాతన్బడన్ ద్రోచి యత్తాలహాలావృతోద్వేల షేలస్ఫురత్కీలి కీలాకలాపంబు నన్ లంకనిశ్శంకుడై కాల్చి కౌతూహలంబొప్ప వాతూలము న్బోలి యత్యల్పకుల్యంబు తుల్యంబుగా వార్ధి లంఘించి నిన్గాంచి నేగాంచితిన్ వార్ధి కాంచీసుతన్నీత లోకైకమాత న్కృశీభూత సత్యుగ్రనక్తంచరీ సంచయోపేత లంకాపురోద్యాన మధ్యప్రదే శంబునందంచు వాక్రుచ్చి యచ్చేడె చూడామణిం జేతికందించి నన్ మెచ్చి కార్యార్థివై వార్ధి సంప్రార్థనం బర్థిగావించి సీతాసతీ మానసోత్సాహ సమ్యక్క్రియా హేతువున్ సేతువున్ గట్టి పెన్దిట్టవై చెట్లు ద్రిమ్మర్ల చుట్టుం భంజింపంగ యా యర్ణవోత్తీర్ణ ముజ్జేరి యా రమ్య యామ్యప్రదేశంబునందున్ సువేలాచలాగ్రంబునన్ నిల్వ దుర్వారపూర్వామరా ఖర్వగర్వాట్టహాసధ్వనుల్ వీనులన్ సోక పెన్వ్రేకదుర్దాంత కల్పావసానాభ్ర గరారవానల్పహుంకారులై భూర్యహంకారులై కిష్కైజేవ సుగ్రీవ తారాతనూజాంజనే యాది శాఖామృగేంద్రుల్ మృగేంద్రోపమానుల్ నిరాఘాటులై ఘాటినవ్వీటిపై దాటి పెన్బొబ్బలన్ గొబ్బునన్ దానవీగర్భనిర్భేద మొందించుచున్ గోటకొమ్మల్ కవాట చటాట్టాల కారాగార ప్రాకార సౌధాదులన్గూల్చునన్ చెల్చునన్ దక్షులై యా విరూ పాక్ష యూపాక్ష ధూమ్రాక్ష కుంభాతికాయేంద్రజిత్కుంభ కర్ణాది మాయావిధానావధాన ప్రధానుల్ మహాయాతుధానుల్

గదాముద్గరప్రాస కోదండ చక్రాద్యనేకాయుధోపేతులై విక్రమ
స్ఫీతులై కోతులన్నాకి కోదండపాండిత్యముం జూప కీశులత్యుద్ధతఁ
సాలముల్ శైలముల్ వాలముల్ రువ్వుచున్ . కాలకేలన్విదారింప
నన్యోన్య సైన్యంబులత్యంత దైన్యంబునొందఁ శరారుల్ సురా
రుల్ కుభృద్ధీరులై మీఱి యవ్వానరాళిఁ విదారింప సుగ్రీవతారా
తనూజాంజనేయాది మహాబలోదగ్ర కీశాగ్రణుల్ శైలముల్గ్రువ్వ
చుఁ సాలముల్ రువ్వుచుఁ రాక్షసానీకము న్మృత్యువొందించుచు
న్మీఱి యీ రీతి కుంభప్రహస్తాదుల న్జంప సౌరంభమేపార సౌమి
త్రియునీవు సంవర్తకాలంబు హృద్వర్ష ధారోపమద్ఘోర శస్త్రా
స్త్రధారాప్రసారంబులన్ కుంభకర్ణాతికాయేంద్రజిన్ముఖ్యభీమా
సురగ్రామ సంహారమొందింప జన్యంబగణ్యంబ పూర్వంబ
సామాన్యమైజెల్ల తచ్ఛేషాదోషాచరుల్ బారి యీ పోరు తీరంత
యుండెల్ల మండోదరకాంతు డత్యంత దుఃఖాన్వితుడయి కొంత
సేపుండి యాతఁ సతోత్పాటి తాత్యుగ్రసింహంబు చందంబునఁ
క్రోధరక్తాక్షుడై యాస్యముల్ జేవురింపంగ దుర్దాంతకల్పాంత
కాలానలాక్షుఁ విడంబించుచుఁ కాలకేతుండు రథ్యంబులన్దోల
నేతెంచి నిన్నాకి ఘోరాస్త్రజాలంబుల న్ముంప నీ వెంతయుఁ కుండ
లీభూత కోదండపాండిత్య నైపుణ్యమేపార జ్యానాదముల్ మీఱ
దుర్వార నారాచపాళిఁ నిగుడ్పఁ శచీకాంతు డత్యంత కారుణ్య
సుస్వాంతుడై తేరుపుత్తెంచినఁ మాతలిన్మెచ్చి తేరెక్కి పూర్వా
చలారోహణాబ్జాప్తు రీతిఁ వెలుంగఁ జయోత్కంధనన్యోన్య
నిర్ఘాతసంఘాత ప్రస్ఫీత ప్రక్ష్వేడనచ్ఛన్న దిగ్భాగులై దంతియుఁ
దంతియుఁ సింహముఁ సింహముఁ బోరునెల్ల డహోరాత్రముల్
వాడిమైయీడులేకుద్ధతిఁ యుద్ధవై యాశ్చర్యము న్జూపుచుఁ బోరు
కాలంబునఁ ప్రస్ఫురద్రత్రిశూలోపమద్ఘోర నారాచపంక్తిఁ కరం
బుల్ సిరంబుల్ సురల్మెచ్చ దున్మాడి బ్రహ్మాస్త్రముఁ మార్వి
సంధించి బ్రహ్మాండమాకంప మొందఁ బ్రహ్మాదు లత్యంతభీతిఁ

న్కాలంగన్ బ్రయోగింప కాలానలాభీల జ్వాలావళిన్ దిక్కులన్ గప్పుచున్ వక్షమున్ వ్రచ్చి యా రావణున్ లోకవిద్రావణున్ గూల్చినన్ మేల్మెబాసంచు బృందారకల్ప ప్రసూనామితాసార పూర్వంబుగా దుందుభిధ్వానము ల్సేయుచున్ వేల్పులానందవారాశిలోఁదేల రంభాదిరంభోరు లత్యంత సంప్రీతినృత్యంబుల న్సల్పి సంకల్పసిద్ధుండవై కుంభకర్ణానుజున్ లంకకున్ రాజుగావించి నీయాజ్ఞ లోకాపవాదాపనీతార్థమై వీతిహోత్రప్రవేశంబు గావించి దీపించి సత్పూతచారిత్ర సాధ్వీశిఖామణియౌ సీతతో భ్రాతతోడన్ త్రియామాచరుల్ వానరుల్ గొల్వ బల్మెకుకున్ బుష్పకం బెక్కి యా జానకీకాంతకున్ జన్యవృత్తాంతము న్దెల్పుచున్ సర్వలోకైకవిఖ్యాత సౌశీల్య సౌభాగ్య సంఘాతమైనట్టి సాకేతము న్జేరి బల్జివ్వనన్ మవ్వపుంభక్తితో నవ్వలన్ మువ్వురన్గాంచి సాష్టాంగ దండప్రణామంబుల న్జేసి సంప్రీతితో భ్రాతల న్గౌగిటం జేర్చి యా యమ్మల న్దమ్ముల న్బంధువర్గంబులన్ సమ్మదాంభోధి దేలించి పట్టాభిషిక్తుండవై ధారుణీజాప్రియుక్తుండవై ధాత్రిఁబాలించు నీ చిత్రచారిత్రము న్దెల్ప నా శక్యమె రామ! లోకాభిరామా! గుణస్తోమ కారుణ్యధామ! నమస్తే నమస్తే నమస్తే నమః...

శ్రీరామదండకం సంపూర్ణం

---

గీతార్థసార దండకం (శ్రీకృష్ణదండకం)

శ్లో॥ పార్థసారథి మబ్జాక్షం ద్వారకానిలయం హరిం ।
రుక్మిణీశం హృషీకేశం శ్రీకృష్ణం ప్రణమామ్యహం ॥

శ్రీ మత్సరోజాతనేత్రా విదర్భేశపుత్రీకళత్రా లసచ్చిత్ర చారిత్ర ధాత్రీశగోత్రా గ్రిగణ్యుండవై చిత్రవీర్యుండవు సద్భక్తి సంప్రీతి

మృత్యుంజయుఁ సంజయుఁ గాంచి మత్పుత్రులుఁ పాండురా
ట్పుత్రులుఁ గ్రుద్ధులై యుద్ధతిఁ యుద్ధసన్నద్ధులై ధర్మక్షేత్రంబు
నఁ క్షత్రధర్మంబునన్జేరి వారాజిలో నేమిగావించిరో చెప్పుమ
న్నన్ వినోదంబు జేకూర కేల్మోడ్చి యో దేవ యీ రెండుసైన్యం
బులున్ జేరి యుద్యుక్తులై యుండ నా మధ్యరథ్యంబుల న్నిల్పి
పృథాపుత్రుండు పంకేజనేత్రున్నిరీక్షించి పీతాంబరాజ్ఞాతిఘా
తంబునన్ పాతకంబునంచున్ ధనుర్బాణముల్వీడి చింతాకుల
స్వాంతుడై యుండ కృష్ణుండహో ఫల్గునా జీవనాశంబులేదెన్న
డుఁ దేహమెబ్బంగినిన్నిల్వ దెన్నంగ భావంబుతుల్యంబుగావించి
బల్దిట్టమైనట్టి యీబుద్ధితో యుద్ధమీరీతి గావింపుమీ చావుగెల్పు
ల్పమానంబులంచుఁ వికారంబులేకెంతయున్ కోరికల్ మాని
ఆత్మఁ మమత్వంబహంకారమున్వీడి యోయర్జునా కర్మముఁ
జ్ఞానముఁ రెండుకల్పించితిఁ మున్ను నాకర్మవర్జింప శక్యంబుగా
దేరికిఁ గావునఁ స్వీయకర్మంబుగావించుచుఁ తత్ఫలంబందు కాం
క్షల్ విసర్జించుటల్ మేల్మమత్వంబహంకారమున్మాని నైష్కర్మ్య
సిద్ధింజితేంద్రిత్వమగ్నుండవై నిర్మలజ్ఞానయుక్తుండవై కామము
న్గెల్వుమో పార్థివా యన్ని నేనంచు నాతెల్వితో కర్మముఁ
జేయుచుఁ తత్ఫలంబందు కాంక్షల్ విసర్జించుచుఁ మున్నుగావించి
రీవట్లుగావింపుమీ యున్నవన్నింటినిఁ లేవులేవంచు నీలేనివన్నిం
టినిఁ చిత్తమందున్నవంచుఁ గనుంగొన్న ధీమంతులాశల్ విస
ర్జించి సత్యంబుగన్గొన్నవారై మదిఁ సంశయచ్ఛిన్నులైయున్నవా
రైరి యీజ్ఞానులో పాండవా యోగసన్యాసముల్ రెండునేకంబు
కాగఁ ఫలత్యాగయోగంబె శ్రేయంబుగా రాగవిద్వేషముల్వీడి
వాగాదిపంచేంద్రియంబుల్ వెసఁ గూడి తామింద్రియార్థంబులన్జేరి
భోగించు తాఁ గాదు యీరీతి తానేగుచుఁ వేడ్కసంయోగమేపార
ప్రాణంబపానంబునఁ యోగబుద్ధిఁ దగఁ కన్బొమల్మధ్యయం
దాగి బ్రహ్మముంబొందునా యోగి యోపార్థ స్వాంతంబునేకాగ్ర

ముజ్జేయుటెచ్చో తపోకర్మజ్ఞానంబులీ మూడునుందక్కలో దర్భ
చర్మాంబరాసీనుడౌచున్ శిరోగ్రీవము ల్తిన్నగానిల్పి నాసాగ్రమీ
క్షించి కోర్కెల్ దిగంద్రొక్కి సంకల్పముల్మానినన్ మానసంబం
తనిర్వాతదీపంబుచందంబునన్ బ్రహ్మముంబొందు కుంతీసుతా
యన్నియు న్నేన నీ తెల్వియే జ్ఞానమా భిన్నభూతాత్మకం
బైన యామాయకున్ మేలగున్ జీవమన్నిటిందాల్చు నన్నిం
టికిన్ జీవమైయుండునే పూసలన్దారమున్నట్లు త్రైగుణ్యయుక్తాత్మ
కంబైన మాయాసమన్వీతులై జ్ఞానహీనుల్ నన్ గానగాలేరు
విచ్ఛిన్నసమ్మోహద్వంద్వుల్ వలెన్ యోగిప్రాణంబులన్బాయువేళ
న్మదిన్సర్వమున్మాని యోంకారమెల్లప్పుడున్ ధ్యానమున్ జేయు
చున్ముక్తుడౌ యోగసంపూర్ణసత్వంబునన్ లాగి ప్రాణంబులన్
ప్రోగుచేకన్బొమ్మల్మధ్యయందాగుచున్ లోగతిన్ ద్వారముల్ గట్టి
సద్యోగియా బ్రహ్మరంధ్రంబులేచించి తాశుక్లమార్గంబునన్ బ్రహ్మ
మున్ జెందుభీమానుజా నేనునన్నింటనవ్యక్తరూపంబుగానుందు నా
యందుసర్వంబునిల్చుల్ తుదిన్ చింతలెల్లన్ విసర్జించిసద్భక్తినన్గొ
ల్చువానిన్ ప్రసన్నుండనై ప్రోతు నన్నింటవ్యాపించి యెద్దానినిన్
సోకకున్నట్టినన్నెప్పుడున్ గొల్చువారిన్ మహాత్ముల్పవర్ణస్థులైన
న్వైసన్నోబ్బతు సద్వర్ణసంభూతు లన్జెప్పనేలాసురేంద్రాత్మజా దేవ
తుల్ మానవుల్ వాజులశ్వంబులున్ శైలతిర్యక్కులున్ భూజముల్
శస్త్రముల్ పక్షులున్ పన్నగాదుల్ సరిత్సాగరంబుల్ పురంబుల్
నదుల్ ధైర్యకీర్తుల్ కడునాకలమున్ వత్సరంబుల్ ఋతుల్ మాస
ముల్ వీనిలో మేటినారూపుసుమ్మా స్థిరంబై జగద్బీజమేకాంశ
మోసవ్యసాచీ జగద్రూపునిన్ నన్నువీక్షింపుమీదివ్యదృష్టింబ్రసా
దింతునైకోమ్మోగిన్ మిక్కిలిన్చిత్రముల్వేలువేలుండు తేజోమ
యంబై చరంబున్ స్థిరంబున్ జెలంగున్ భవద్వైరివర్గంబులెల్లన్ గత
ప్రాణులైరింకనిర్గర్వివై కీర్తిచేకోనుమ్మభీభత్స వినిర్గుణాన్వీతమైనన్
తుదిన్ నిర్గుణంబైన యా బ్రహ్మమందున్నదింజేర్చ మోక్షం

జిగున్ యుక్తమౌరీతినత్యంతకష్టంబుచేనైన నాపై మనోబుద్ధులన్
నిల్పినన్ బ్రోచెదన్ ద్వేషహీనంబునన్ భూతకారుణ్యమున్గల్గి
సద్బుద్ధితో నన్ను ధ్యానించు నాభక్తులెల్లన్ వగన్జెందకన్ నన్నుజే
రున్ సుభద్రాపతీ కాయమెన్నంగ క్షేత్రంబు క్షేత్రజ్ఞుడన్నేను నా
యంపుమాయాపరబ్రహ్మముల్ నిల్చుగానన్ మనంబున్ సమా
నంబునొందించుచే జ్ఞానమై యుండు జ్ఞేయంబు బ్రహ్మంబు
తద్బ్రహ్మమన్నింట మిన్నుంబలెనోస్క కజ్ఞాప్తు
రీతిన్వెలింగించు నో నెచ్చెలీ దానంజగంబుద్భవించెన్ జగద్బీజమై
యుండెదన్ నేను సత్వంబునన్ రాజసత్వంబునన్ దమంబెన్నగాజీవ బం
ధంబుగావించు నీమూడుసౌఖ్యంబులున్ రాగమోహంబులున్గాన
తత్సౌఖ్యదుఃఖాదులన్ రాగమోహాదులన్ మానినన్ నిర్గుణ
త్వంబుసిద్ధించు నింకన్ సమత్వంబుసఖ్యంబున్ ద్వేషమున్ లేనిచో
ధర్మరాజానుజా యూర్ధ్వమూలంబధశ్శాఖలంజూడగానింద్రియార్థ
ప్రవాళంబులున్ వేదపత్రంబులున్గల్గి త్రైగుణ్య సంవర్ధితంబైన
యశ్వత్థవృక్షంబు నిస్సంగశస్త్రంబున ద్రుంచినన్ మోక్షమబ్బున్
జగజ్జాలకూటస్థముల్ రెంటికిన్ నేను శేషించియుందున్ మదీ
యాంశలై యుండు జీవంబులెల్లన్ మదిన్ నన్ను సర్వంబుగా నెంచి
సేవింపుమీ నీవు గోప్యంబిదే సుమ్మ వీరాగ్రణీ దైవరాత్రించర
త్సంపదల్ రెండురీతుల్ దయాసత్యముల్ సత్వభావంబు శౌచంబు
నున్ దైవసంపత్తి దుర్మానదుర్గర్వముల్ జీవహింసల్ సురద్వేష
సంపత్తి దైవంబు మోక్షంబగున్ దుర్గతింజేయు దైత్యంబులా
దుర్గతి ద్వారముల్ మూడు కామంబు లోభంబు మోహంబు
వీనిన్విసర్జించి శాస్త్రప్రకారంబునన్ నన్ను సేవింపుమో కవ్వడీ
సత్వమున్ రాజసంబున్ దమంబంచు శ్రద్ధల్ త్రిరూపంబులై యుం
డునందెన్నగా సాత్వికుల్ వేల్పులన్ రాజసుల్ యక్షదైతేయు
లన్ తామసుల్ ప్రేతపైశాచవర్గంబులన్ గొల్తురాహారకృత్యం
బులన్ యజ్ఞదానాదులన్ తత్ప్రకారంబులై యుండు దానన్ తపో

యజ్ఞదానక్రియల్ భక్తినోంకారము న్బల్కి గావింతురార్యుల్ కురుగ్రామణీ కామ్యకర్మ ల్విసర్జించుటే త్యాగమానాత్మకర్మల్ సమాసక్తి హీనంబుతో సల్పుటల్ ముక్తియందెన్న త్రైగుణ్య సత్యాగమంచున్ గదున్ జ్ఞాన ముఖ్యంబటంచున్ మదిన్గాంచి నన్గొల్చుచున్ కర్మలెల్లన్ మదాధీనమున్జేసి సద్భక్తి నన్నెప్పుడు న్వేడుమీ యో కిరీటీ రహస్యంబిదేసుమ్మటంచిట్లు నా సంజయుం డంబికాపుత్రుతో బల్కె నో కృష్ణ నీ గీతలన్ నిత్యమున్భక్తిసం యుక్తులౌచున్ పఠింపంగ కైవల్యసంప్రాప్తమౌ నర్థమందున్ పఠింపంగ గోదానపుణ్యంబు గాంచున్ త్రిభాగంబు గంగానదీ స్నానతుల్యంబు షష్టాంశమున్ సోమయాగంబు గావించు పుణ్యం బు నధ్యాయమున్ రుద్రలోకంబు నొందించు నందొక్కపాదైన మర్త్యత్వమున్ జన్మజన్మంబునన్గాంచు నందొక్క శ్లోకంబు, శ్లోకార్థమున్ చంద్రలోకంబు నొందించు నీ గీతలాలించుటల్ నీ సమీపంబునందు సుఖించున్ రమేశా! హృషీకేశ! సర్వేశ! వైకుంఠనాథా! నమస్తే నమస్తే నమస్తే నమః...

గీతార్థసార దండకం సంపూర్ణం

---

; శ్రీ సూర్య దండకము ;

శ్లో॥ బ్రహ్మవిష్ణీశ్వరాకారం బ్రహ్మాద్యమరపూజితం ।
ఛాయానాథం త్రయీవేద్యం వందే సూర్యం దివాకరం॥

శ్రీ మత్సరోజాతమిత్రా సుచారిత్ర ఛాయాసమాఖ్యాబ్జనేత్రీకళత్రా సమస్తామరస్తోత్రపాత్రా జగన్నేత్రమిత్రా దినాధీశ జ్యోతిర్గణా ధీశ చండప్రకాశా త్రిమూర్తిస్వరూపా త్రయీరూప లోకైక దీపా తమోదూర భూరిప్రభాగార వందారుమందార రక్తోత్పలా కార నీహార సంహార కారుణ్యరత్నాకరా శ్రీకరా భాస్కరా దేవతాచక్రవర్తీ చిదానందమూర్తీ నభోభాగవర్తీ ఘృణీ ద్యో

మణీ భక్తచింతామణీ పూషనిర్ధూతదోషా కనద్రత్నభూషావిశేషా మరీచీసురోచీ రవీ కర్మసాక్షీ నమో విశ్వకర్తా నమో విశ్వభర్తా నమః పాపహారీ నమో దేవదేవా నమో ద్వాదశాత్మా నమో లోకబంధో నమో సూర్యతుభ్యం నమోయంచు నిన్నాత్మయం దుంచి పల్మారు నిష్ఠాగరిష్ఠాత్ములై శక్తినాసక్తి సద్భక్తి సంయుక్తులై వేడి జేజేలుగావించు వారెంతయున్ సంతతారోగ్యభాగ్యంబులన్ విశ్వతౌదార్య తస్త్వార్యవీర్యంబులన్ నిత్యసంతోషసౌకర్య సన్మాన్య సౌజన్యముల్ గాంచుటల్వింతయే పద్మినీకాంత ధాతాబ్జనేత్రా త్రినేత్రాకృతిన్బ్రాని బ్రహ్మస్వరూపుండవై యుండ నీ భక్తులాముక్తకన్యాకరాగ్రాహముల్జేయరే చిత్రభానో భవచ్చారుచారిత్రముల్ గాపె విఖ్యాతిమీరన్ నిరాలంబమార్గంబునం దేకచక్రింబనూరుండు సూతుండు సప్తాశ్వముల్ భోగిరజ్జున్ చెలంగన్ హాయలీల్మీరు మేత్తేరుపై నెక్కి తొల్దిప్పయందున్ బయల్దేరి యస్తాద్రికిన్ నాల్గుయామంబులన్ ప్రత్యహంబున్వడిన్జేరు నాలోనలోకప్రమోదంబుగా రక్షిసాఫల్యమొందించుచున్ సత్కరానీతనీరంబు నభ్రంబునన్ జేర్చి పద్విష్టపాత్యంత సంతుష్టిగావించి దివ్యప్రభావంబుచే జీవులన్బ్రోచు నిన్నాత్మభావించి డంబంబులేనట్టి భక్తిన్ భవద్బింబవీక్షించుచున్ ప్రీతితో జ్యోతలర్పించునన్ దుష్టమేహోదరా కుష్ఠశూలాతి సారాండపాండుక్షయల్ సన్నిపాతజ్వరశ్లేష్మ వాతామపైత్యాద్యనేకోగ్ర రోగంబులన్ బాపి తత్తన్ మనోభీష్టముల్ దీర్చు దేవుండవీవేకదా యర్కమార్తాండ హేళీనమద్దేవపాళీ కనద్రత్నమాళీ సదా నిన్మదిన్భక్తి భావింతు సేవింతు మ్రొక్కుల్లిదింతున్ నుతింతున్ ననున్ దీనదీనున్ విపన్నున్ ప్రపన్నున్ ప్రసన్నుండవై బ్రోవుమా దీనబంధో నమస్తే నమస్తే నమస్తే నమః॥

శ్రీ సూర్యనారాయణ దండకం సంపూర్ణం

---

## ॥ శ్రీశనైశ్చరదండకం ॥ ✓

శ్లో॥ నీలాంజన సమాభాసం రవిపుత్రం యమాగ్రజం।
ఛాయామార్తాండ సంభూతం తన్నమామి శనైశ్చరం॥

శ్రీమన్మహచ్చిత్ర చారిత్ర ఛాయాసతీపుత్ర సుత్రామముఖ్యామర స్తోత్రపాత్రా మహానీలగాత్రా పవిత్రా కృతాంతానుజా భానుజా విస్మయోదార దుర్వారఘోరప్రచారా సుచారా తపోదగ్ధకాయా యజేయా జగద్గేయ శుష్కోదరా నమ్రభక్తాదరా శ్రీకరా భీకరా సంతతానంద సంధానమందా నమద్దేవబృందా వినీలాంబరా విశ్వతాడంబరా జ్ఞానదృష్టిప్రసాదా సుసారా మహద్గృధ్రవాహా కన దీర్ఘదేహా గ్రహాధ్యక్షు సద్యోగమార్గైకదీక్షా మహద్దక్షు రూక్షాక్షు సద్భక్త సర్వాపదోద్ఘాత సూలే లసద్రత్నమాలీ కృతాంతా సుశాంతా సుమాంగళ్యకారీ వినీలాశ్మహారీ మహోద్దండకోదండ ధారీ శనీ భాస్కరీ భక్తితో రక్తితో సంతతాసక్తితో రంపిషే ల్మల్లి పూదండగా దండకంబేన్నుగావించి భావించి సేవించి నీకున్ సమర్పించితిన్ దప్పులిందున్నచో నొప్పుగాజూడు మోయప్ప వాగీశభోగీశులైనన్ నినుం బాగుగా నెందు వర్ణింపలేరన్న నేనెన్నగా నెంతవాడన్ జడుండన్ మహామూఢుడన్ బాలవాక్యంబు లాలించురీతిన్ మదీయోక్తు లాలించి పాలింపుమోసామి సంతుష్టియుక్తాంతరంగుండవై యున్నచో మండితాఖండసద్రాజయోగంబులం సంతతానంద సత్యాగభోగంబులన్ సర్వలోకానురాగంబులన్ జేతువత్యంత చండప్రకోపుండవై యుండినన్ రోగ సంతాపచింతా మహాదైన్యదుఃఖంబులొందించి గుందింతువో దేవ నీ చూపుకేమాత్రమునోర్వక నాకాకమర్త్యాహిపక్ష్యాండ జాతావళిన్ దైన్యమొందించు నిందాదులన్ సప్తమస్థానిందులన్ తావలోకమార్గంబునన్ జిక్కినన్ గ్రక్కునన్ గ్రుక్కి స్వస్థానవిభ్రష్టులై

నష్టులైయుందురో భూనుజాదేశముల్ గ్రామముల్ భూజముల్ తాప
పకాద్యుగ్రచక్షుప్రసారంబు చేతన్ వడిన్ గండడంగున్ సదానీవవా
ర్యుండవార్యుండ వత్యంత గాంభీర్యధుర్యుండ వాపన్నివార్యుండ
వో ప్రోడ జన్మద్వితీయాష్టమ ద్వాదశార్ధాష్టమ స్థానయుక్తుండ
వైనన్ కృపాయత్తచిత్తుండవై బ్రోవుమో ఖేటవర్యా మహా
శ్చర్యచర్యా నమస్తే నమస్తే నమస్తే నమః॥

శనైశ్చర దండకం సంపూర్ణం

---

: దేవీ దండకం :

శ్లో॥ సర్వలోకేశ్వరీం దేవీం చంద్రార్ధమకుటాం శివాం ।
హిమాచలసుతాం శాంతాం పార్వతీం ప్రణమామ్యహం॥

శ్రీ మన్మహారాజరాజేశ్వరీ సర్వలోకేశ్వరీ నమ్రభక్తాధరీ భవ్యబింబా
ధరీ భూరికారుణ్యరత్నాకరీ శాంకరీ సర్వలోకైకమాతా శుభో
పేత్యలావణ్య సౌందర్యసంభూత సుస్ఫీత్సరోజాతనేత్రీ పవిత్రీధరా
ధీశపుత్రీ సమస్తామరీచారుసీమంత సింధూర సద్రక్తకాంతి స్ఫుర
త్పాదపద్మా సదాసేవకాభూత వాగీశ్వరీపద్మ నారాయణీ భద్ర
కాళీ భవానీ లసచ్చంద్రరేఖావతంసా సుపర్వాణకాంతావతంసా
జగజ్జాలదీపా మహద్విశ్వరూపా అనంతప్రతాపా పద్యాంజ్యంతే
హీన మదేభేంద్రయానా యవిద్యా అనాద్యా మహాదేవదేవీ
భవద్భవ్యదివ్య ప్రభావంబు జాల్పొప్పగాదెల్ప దోర్వేల్పుకై
నన్ దరంబే జగత్సృష్టియున్ బుష్టియున్ నష్టియున్ జేయుచున్
భూరి బ్రహ్మాండభాండంబు లేపారగా బొజ్జలో నిల్పి వాణీభవానీ
రమారూపముల్ దాల్చి కంజోద్భవాబ్జాక్ష ఫాలాక్షులన్మువ్వు
సృష్టించి యామూర్తులంబొంది నీ దివ్యశక్తిప్రభావంబు లామూ
ర్తులన్జేర్చి వర్తించి సర్వంబు నీవై మహామేయ మాయా తమ
స్తోమమైయుండెల్ల లోకంబులన్మించి కాంతాత్మజార్థాదులందాసక్తి

కల్పించి పంచేంద్రియాధీనుల నైర్వరిషడ్వర్గసంయుక్తులన్ బూర్వ జన్మార్జితోదార కర్మార్జితానేక వృత్త్యంతరోపేతులన్జేసి తత్పుణ్య పాపానుసారంబుగా సద్గతిన్ దుర్గతిన్ జేర్చి యా వెన్కలోకంబు నన్ బుట్టగా గిట్టగా జేయవే నిన్ను సంపూర్ణవిజ్ఞాన దృష్టిన్ విలోకించినన్ గల్గు మోక్షంబు నీ పాదపంకేజయుగ్మంబు సద్భక్తి నర్చించు వారెంతయున్ వింతగా సంతతానంద సంతోషితస్వాంతులై సౌఖ్యముఖ్యాధికైశ్వర్యవిఖ్యాతులై యుందురో తల్లి సద్భక్తసంతానవల్లి నమస్తే నమస్తే నమస్తే నమః॥

దేవీదండకం సంపూర్ణం

---

## : శ్రీ హనుమద్దండకం :

శ్లో॥ శ్రీరామదూతం జగదేకపూతం శుభాకరం దానవభీకరం।
జితేంద్రియం నమ్రజనామరద్రుమం నమామి వాతాత్మజ
మాంజనేయం॥

శ్రీ మజ్జగత్ప్రాణపుత్రా పవిత్రా లసచ్చిత్రచారిత్ర నోత్తారిముఖ్యా మరస్తోత్రపాత్రా జగద్గేయగాంగేయ శైలోపమస్ఫూర్తాయ శ్రీఆంజ నేయాహనూమంతధీమంత సుస్వాంత సత్కీర్తివంతా ప్రశాంతాప యోరాశి గంభీర హేమాద్రిధీరా మహావీర సద్భక్తమందార సన్మంగళాకార కారుణ్యరత్నాకరా శ్రీకరా రామకార్యైకనిర్వా హకా భూరిలంకాపురీదాహకా సింహికాప్రాణసంహారకా లక్ష్మణ ప్రాణసంరక్షకా జానకీ శోకనాశా దినేశప్రకాశ మహద్వానరా నీకచూడామణీ రామభక్తాగ్రణీ స్వామి నీ చిత్రచారిత్రముల్ బొల్పుగా దెల్ప వాగీశభోగీశులు జ్ఞాలలేరన్న నోయన్న నేనెన్న గానెంతవాడన్ జడుండన్ గడున్ దీనుడన్ బాలవాక్యంబులాలించి తాలిరచులీలన్ మదీయోక్తులాలించి పాలింపుమో దీనబంధో ! భవద్బాల్యకాలంబునన్ బాల్యశీలంబునన్ బాలపంకేజమిత్రున్

ఫలభ్రాంతినీక్షించి పక్షీంద్రుచందంబునన్ మింటికిన్వ్రేంటనేదాటి మూడంబరంబొప్ప తద్బింబమున్ మ్రింగనుంకింపవే ధాతచే వాక్పతీనేతచేతన్ వరంబాదరంబు న్దగంబొంది దీపింపవే పద్మమిత్రోద్భవున్ మిత్రగోత్రోద్భవున్ మైత్రిలన్జేసి ధాత్రీసుతాన్వేషణార్థంబుకై యుంగరంబున్ గరంబానవాలంది పాల్పొందు బల్పొనికన్ బూని సుగ్రీవునాజ్ఞ న్మహాత్ప్రజ్ఞ తారాతనూజాది వీరాగుసంచారహారంబుతో వార్ధితీర్థంబువేజేరి యాకోతులన్ప్రీతులన్జేయుచున్ రంగన్మహోత్తుంగ భంగంబులన్ నింగికుప్పొంగు నత్తోయధి న్వాయువేగంబునన్దాటి నిశ్శంకనాలంకలో జేరి యారేయి నాప్రోలు శోధింప కింకన్ నిరోధించు రాత్రించరేట్కింకరిన్ లంకిణీనామకంబొంక మొంకించి సంకోచితాంగుండవై ప్రోడవై మేడలన్వాడలన్ కోటలన్పేటలన్ మేటిపూదోటలన్ నూత్నరత్నప్రభాజాల విభ్రాజితాంతఃపురాళిన్ లసన్మంధిరాళిన్ విలోకించి యాజానకిన్గానకన్ మానకన్ శోధనోద్యోగమేమేర నుద్యానమున్జేరి యాద్యంతమున్జూచునంతన్ మహాచింతతో భీకరాకార రాత్రించరీవారప్రాకారమధ్యంబునన్ సింగమున్జుట్టుముట్టంగ తన్మధ్యసారంగియున్బోలె కన్నీరు మున్నీరుగానేడ్చు నారామరామన్విలోకించి చింతించి భూకాంతువృత్తాంత మాద్యంతమున్ దెల్పి యాయమ్మడెందమ్ము నన్నమ్మసద్భక్తినాసక్తి శ్రీరామభద్రాంకితంబైన తన్ముద్రికన్ గుర్తుగా నిచ్చి నన్మెచ్చి యచ్చేడి చూడామణిన్ మచ్చగా నీకునందిచ్చి వీడ్కోల్ప బల్వేడ్క ధైర్యంబు దీపింప శౌర్యంబుజూపన్ విజృంభించి యాతోటనుత్పాటనంబాచరింపన్ వడిన్క్రుద్ధుడై యుద్ధతన్ వచ్చునయ్యక్షునిన్ దుర్నయాద్యక్షునిన్ ద్రుంచి రేద్రిమ్మరుల్ దొమ్మియైయమ్మలన్గ్రమ్మ నొక్కుమ్మడిన్దున్మి దేవేంద్రజన్మాస్త్రబ్రహ్మాస్త్రబద్ధుండవై తద్విముక్తుండవై రావణున్ లోకవిద్రావణున్ గాంచి సద్బుద్ధులత్యుద్ధతిన్ జెప్పి తద్దైత్యనిక్షిప్త వాలాగ్రవైశ్వానరోదగ్ర కీలాకలాపంబులన్ లంక

దగ్ధంబుగావించి యంతర్లోకృతార్థుండవై చెంగుననబ్ధిలంఘించి సీరాకదీక్షణాప్రతీక్షించు నాజాంబవన్ముఖ్యు లత్యంతసఖ్యంబుతో గొల్వ రాముణ్ త్రిలోకాభిరాముణ్ ఘనశ్యాముణ్ జూచి తత్కాంత వృత్తాంత మాద్యంతమున్దెల్పి యావెన్కబల్కంక నాలంబులో దైత్యజాలంబులన్గూల్చి సన్మైత్రి సౌమిత్రి మూర్ఛన్వడిన్దేర్చి సంగ్రామకేళిన్ దశగ్రీవకుంభశ్రవద్యాసురారణ్య వైశ్వానరుం డైన రాముణ్ మహామానిహృత్కామ నిక్ష్వాకవంశాబ్ధిసోముణ్ జగన్మాతలోకైకపూతన్ ధరాజాతనాసీత సమ్మోదమేపార సంధానమొందించి తత్ప్రవ్యకారుణ్యముణ్ గాంచుధన్యుండవీవేకదా కేసరీనందనా భక్తసచ్ఛందనా వానరానీకనేతా భవిష్యద్విధాతా భవద్దాసుడన్ నీకువేలుజేజేలుగావించి సేవించెదన్ శాకినీఢాకినీ కామినీముఖ్యసర్వగ్రహోత్యుగ్రబాధల్ నివారించి మచ్ఛత్రుకృత్తంత్రమంత్రప్రయోగంబులంబాపి రక్షించు రక్షించు రక్షించు వోవీరవర్యా మహైశ్చర్యచర్యా మహోదార్యతుభ్యం నమస్తే నమస్తేనమః ॥

శ్రీహనుమద్దండకం సంపూర్ణం ॥

---

సాయుజ్యప్రాప్తికి సాధనములగు

# మ హా వా క్య ము లు

1 దేవుని నిశ్చలభక్తి ప్రేమలతో స్మరింపుము
2 ధర్మమార్గము తప్పకుము
3 దయా సత్య శౌచముల వీడకుము
4 బ్రహ్మచర్యమును పాలింపుము
5 నియమిత కృత్యములు విధిగా నెరవేర్చుము
6 కార్యములు నెరవేర్చుటలో నియమితకాలము దప్పకుము
7 మనోవాక్కాయ కర్మలయందు నిర్మలముగా నుండుము.

8 శక్తికొలది దానముచేయుము
9 ఆర్తులకు చేతనైన సహాయము పలువిధములుగా సల్పుము
10 బీదలయందు కరుణగలిగియుండుము
11 భూతదయ కలిగియుండుము
12 అహింస పరమధర్మముగా నెంచుము
13 మాటలువలనగాని, చేతలువలనగాని ఇతరజీవులను హింసింపకుము
14 పరోపకారబుద్ధి కలిగియుండుము
15 సర్వజనుల సుఖము శ్రేయస్సు నిరంతరము కోరుము
16 అందరిని ప్రేమభావముతో జూడుము
17 పరప్రాణుల కుపకారము చేయుటే పుణ్యమనియు, అపకారము సేయుటే పాపమని యెరుంగుము
18 గొప్పవారిని, బీదవారిని భేదభావముతో జూడకుము
19 యితరుల ఉన్నతిని చూచి మత్సరపడకుము
20 ఆత్మస్తుతి పరనింద చేయకుము
21 పరధనమున కాశింపకుము
22 పరస్త్రీలను మాతృదేవతాభావమున జూడుము
23 దుర్వ్యసనముల కలవడకుము
24 నియమములు పాటించుము
25 ఆహార విహార నిద్రాదులయందు మితిమీరకుము
26 కాలము వృథాపుచ్చకుము
27 అనుచితమైన కోరికలు జనింపనీయకుము
28 పేరాశపడకుము
29 కోపమును చంపుకొనుము
30 అహంకార మమకారములను వీడుము
31 ఎవరితోను కలహములు పెట్టుకొనకుము
32 మనసులో కలతపెట్టుకొనకుము
33 అణుకువ కలిగియుండుము
34 తల్లిదండ్రులను సేవింపుము

35 గురువును మన్నించుము
36 బంధుమిత్రులను ప్రేమించుము
37 భృత్యులను దయతో నేలుము
38 దుష్టులకు దూరముగా నుండుము
39 అతిథి అభ్యాగతులను సత్కరించుము
40 అనుచరులను ఆదరణతో చూడుము
41 శరణుజొచ్చినవానిని కాపాడుము
42 బిడ్డలకు మంచిశిక్షణ నిమ్ము
43 సతితో నైకమత్యముగా నుండుము
44 సతికి సన్మార్గము జూపుము
45 ఇంద్రియములను మనస్సును స్వాధీనములో నుంచుటకు ప్రయత్నించుము
46 యోగాభ్యాసము సలుపుము
47 క్షణభంగుర సౌఖ్యకామ్యములు వాంఛించకుము
48 ఆశ్రమధర్మములు క్రమముతప్పగ పాటింపుము
49 చిత్తశాంతి కలిగియుండుము
50 నిరతము సంతుష్టి గలిగియుండుము
51 అంతఃకరణశుద్ధి కలిగియుండుము
52 ఆత్మా అనాత్మా వివేకములు గలిగియుండుము
53 పరమాత్మ నెరుంగుటకు ప్రయత్నించుము
54 సత్సాంగత్యము చేయుము
55 పుణ్యకార్యములు నాచరించుము
56 యాచకులను తూలనాడకుము
57 దానధర్మములు చేయుము
58 తీర్థయాత్రలు సలుపుము
59 ధ్యానయోగాభ్యాసములయందు దీక్ష కలిగియుండుము
60 మితముగా మాట్లాడుము
61 సద్గ్రంథములను పఠించుము

62 సుఖదుఃఖములకు ఓర్మి కలిగియుండుము
63 దేవుడొక్కడే మన ప్రభువని నిక్కముగా నమ్ముము
64 మనలను కాపాడువాడు దేవుడే యని నమ్ముము
65 దేవుడు సర్వాంతర్యామి యని నమ్ముము
66 అంతటనూ దేవుని నిజభక్తులు చూడగలరు
67 నీ లక్ష్యము సదా అంతర్ముఖముగా త్రిప్పుము
68 దేవుని నీలోనే చూడగలవు
69 సకాలమునకు సంధ్యావందనాదులను చేయుము
70 గురూపదేశమంత్రమును సదా పునశ్చరణచేయుము
71 సాత్వికాహారమును గైకొనుము
72 పర్వదినములయందు నిరశనదీక్ష వహించుము
73 ధర్మప్రచారణ చేయుము
74 జ్ఞానము, బ్రహ్మానంద నిత్యసుఖము, సాయుజ్యము సాధనముచే నిశ్చయముగా బడయగలరని మరువకుము
75 ఆచరణలేని ధర్మవాక్యములు వర్షములేని ఉరుములువంటివని తెలిసికొనుము,

ఓం తత్ సత్

---

## పరిశిష్టములు

క॥ శ్రీరాములు మా దైవము శ్రీరాములు మాకుతండ్రి సీతయుతల్లీ
శ్రీరాముని నేగొలిచెద। శ్రీరాములు మాకునిచ్చు సిరిసంపదలన్॥

గీ॥ కృష్ణ వాసుదేవ కేశవ పరమాత్మ। అప్రమేయవరద హరిముకుంద।
నిన్నుజూడగంటి నీ కృపగనుగొంటి। నఖిలసౌఖ్య పదవులందగంటి॥

క॥ రారా నందకుమారక। రారా నవనీతచోర రారా శౌరీ।
రారా రాజులయేలిక। రారా నా ముద్దులయ్య రారా కృష్ణా॥

సీ॥ కుప్పించి యెగసిన కుండలంబులకాంతి।
గగనభాగంబెల్ల గప్పికొనగ।

నురికిన నోర్వక నుదరంబులో నున్న ।
జగములు వ్రేగున జగతిగదల ।
చక్రంబు చేబట్టి చనుదెంచు రయమున ।
బైనున్న పచ్చని పటముజార ।
నమ్మితి నాలావు నగుబాటుసేయకు ।
మన్నింపుమని క్రీడి మరలదిగువ ।

గీ॥ గరికిలంఘించు సింహంబుకరణి మొరసి ।
నేడు భీష్మునిజంపుదు నిన్నుగాతు ।
విడువుమర్జునయనుచు మద్విశిఖవృష్టి ।
తెరలి చనుదెంచు దేవుండు దిక్కునాకు॥

సీ॥ వీడటే రక్కసి విగతజీవిగ జన్ను పాలుద్రావిన మేటిబాలకుండు ।
వీడటే నందుని వెలదికి జగమెల్ల ముఖమందు జూపినముద్దులాడు ।
వీడటే మందలో వెన్నలుదొంగిలి । దర్పించి మెక్కినదానవీడు ।
వీడటే యెలయించి వ్రేతలమానంబు సూరలాడినలోకసుందరుండు॥

గీ॥ వీడులేకున్న పురమటవీస్థలంబు వీనిపొందని జన్మంబు విగతఫలము
వీనిబలుకని వచనంబు విహగరుతము వీని చూడని చూడ్కులు
వృథలు వృథలు॥

చ॥ వరదుడు సాధుభక్తజనవత్సలు డార్తశరణ్యు డిందిరా ।
వరుడు దయాపయోధి భగవంతుడు కృష్ణుడు. దాగుశస్థలీ ।
పురమున యాదవప్రకరముల్ భజియింపగనున్నవాడు నీ ।
వరగిన నిన్నుజూచి విభుడప్పుడయచ్చు ననూనసంపదల్॥

మ॥ కలలోనం దను మున్నెరుంగని మహాకష్టాత్ముడైనట్టి దు ।
ర్బలు డాపత్సమయంబున న్నిజ పదాబ్జాతంబుల్లంబులో ।
దలపన్నంతన మెచ్చి యార్తిహరుడై తన్నైననిచ్చుర్ సుని ।
శ్చలభక్తిం భజియించువారి కిడడే సంపద్విశేషోన్నతుల్॥

మ॥ ఘనుడా కంస విభంజనుండు త్రిజగత్కాంతుండు మోదంబునన్ ।
మనకుం బెక్కు సిరుల్ ఘటించు గడుసన్మానించుగాదేని త ।

ద్వనజాతాక్షుని పాదపద్మములు భక్తిమంజూచినం జాలదే।
చనుడీ యిప్పుడు భోగమోక్షములకుఁ సాధ్యుండు కృష్ణుండిలన్॥

సీ॥ శ్రీవత్సకౌంస్తుభ గ్రైవేయములతోడ లాలితమణికుండలంబుతోడ
మాణిక్యకాంచనమణికిరీటముతోడరహిమించుపీతాంబరంబుతోడ
శంఖచక్రగదాది సాధనంబులతోడ నమితరత్నాభరణములతోడ
బెడతలవ్రేలాడు పికిలిపింఛముతోడ కస్తూరికాంగరాగంబుతోడ

గీ॥ జాంబవతియును గాళింది సత్యభామ।
మిత్రవిందయు భద్రరుక్మిణి యనంగ।
మహిషులందరు సేవింప మాని యెదుట।
శకటదానవవైరి సాక్షాత్కరించె॥

సీ॥ ఇతడటే జగమెల్ల నెసగింప దేవకి। కడుపుచల్లగగన్నకొడుకుకన్న
డితడటే నందునిసతికి బొత్తిళ్లలో బుడుతడై వెలసిన ముద్దులయ్య
ఇతడటే వ్రేపల్లె నెల్ల బాల్మిగడల్ వెన్నలు దొంగిలితిన్నకొంటె
ఇతడటే చన్నుబాలిచ్చి చంనగవచ్చు పూతనజంపినబూమెలాడు

గీ॥ ఇతడటే వ్రేలబెనుగొండనెత్తినాడు ఇతడటేమద్దులంగూలనేసినబలి
ఇతడటే వ్రేతలంగూర్మినేలిన విభు డితడటే లోకమేలు లక్ష్మీశ్వ
రుండు॥

సీ॥ ఇతడుకదా జగంబేర్చునట్లేతెంచు కార్చిచ్చుచల్లార్చికాచెప్రజల
ఇతడుకదా జగద్ధితముగావించెను కాళీయఫణిఫణాగ్రంబు మెట్టి।
ఇతడుకదా మహోన్నతులై గర్వించు కంసాదిదనుజుల గండడంచె
ఇతడుకదా జగత్త్రితయ మగ్గింపంగ యదువృష్టిభోజాంధకాళినేలె

గీ॥ ఇతడుకా రుక్మిణీశుడై యెసగమెసగు
ఇతడుగా పారిజాతంబు నిలకుదెచ్చె
ఇతడుగా సత్యభామకు హితముగూర్చె
ఇతడుగా సర్వలోకము లేలుమేటి॥

సీ॥ ఇందీవరశ్యాముఁవందిత సుత్రాము కరుణాలవాలు భాసురకపోలు।
కౌంస్తుభాలంకారు కామితమందారు సురుచిరలావణ్యుసురశరణ్యు।

హర్యక్షనిభమధ్యు నఖిలలోకారాధ్యు ఘనచక్రహస్తుజగత్ప్రశస్తు
ఖగకులాధిపయాను కౌశేయపరిధాను పన్నగశయను నబ్జాతనయను

గీ॥ మకరకుండలసద్భూషు మంజుభాషు నిరుపమాకారుదుగ్ధసాగర
విహారు
భూరిగుణసాంద్రు యదుకులాంబోధిచంద్రు విష్ణురోచిష్ణుజిష్ణు
సహిష్ణు కృష్ణు॥

క॥ ఎటువలె కరిమొరవింటివి ఎటువలె ప్రహ్లాదుకభయమిచ్చితికరుణన్
నటువలెనను రక్షింపుము కటకటనిను నమ్మినాడ! కావుముకృష్ణా॥

సీ॥ వేకువనే నిన్నువేడు కొందామంటె।
నిదుర బద్ధకమునన్ వదలదయ్య।
పగలైననీనామ పఠన సేయుదమంటె।
స్నేహితులెవ్వరో చేరుచుంద్రు।
పవళించునపుడునిన్ బ్రార్థించుదామంటె।
తలకెక్కిన దరితందనలవ్రొక్కు।
తెరిపిచేసుకొనినిన్ స్మరియించుదామంటె।
యూహలెన్నెన్ని యోయుద్భవించు।

గీ॥ చెడుటకిది యదియననేల బడుకునయ్య।
భావమెరిగి నన్నేలు కోవలయునయ్య।
బాల గోపాల నవనీత భావశీల।
ధవళవదనారవింద రాధాముకుంద॥

క॥ నారాయణ దామోదర। నీరజదళనేత్ర చక్రి నిఖిలేశగదా।
ధారీ గోవింద నమస్కారము యదుపుత్రి। నిత్య కల్యాణ నిధీ॥

శా॥ ఏరూపంబున దీనిగెల్తునిటపై నేవేల్పు జింతింతునె।
వ్వారింజీరుదు నెవ్వరడ్డమిక నివ్వారి ప్రచారోత్తమున్।
వారింపందగు వారలెవ్వరఖిల వ్యాపార పారాయణుల్।
లేరే మ్రొక్కెద దిక్కుమాలిన మొరాలింపన్ బ్రపుణ్యాత్మకుల్॥

మ॥ అలవైకుంఠ పురంబులో నగరిలో నామూల సౌధంబుడా ।
పలమందార వనాంతరామృత సరఃప్రాంతేందుకాంతోపలో ।
త్పలపర్యంకరమా వినోదియగునాపన్న ప్రసన్నుండువి ।
హ్వాల నాగేంద్రము పాహిపాహియనకుయ్యాలించి సంరంభియై ॥

క॥ కలడందురు దీనులయెడ। కలడందురు పరమయోగి గణములపాలన్
కలడందురన్ని దిశలను కలడు కలండనెడువాడు కలడో లేడో ॥

క॥ ఇందుకలడందు లేడని సందేహమువలదు చక్రిసర్వోపగతుం ।
డెందెందు వెదకి చూచిన నందందే గలడు దానవాగ్రణి వింటే ॥

శ్లో॥ సాంబసదాశివ శంభోశంకర । శరణంమేతవచరణయుగం ।
శంభోశంకర గౌరీశహర । శరణంమేతవచరణయుగం ।
సాంబసదాశివ సాంబసదాశివ సాంబసదాశివ సాంబహర ।
కాశీపతే వారణాసీపతే । గంగాజటాజూట గౌరీపతే ॥

రాధారమణ మదనమోహన బృందావన చంద్రకృష్ణ ।
శ్రీకృష్ణచైతన్య ప్రభునిత్యానందం । హరేరాం హరేకృష్ణరాధే
గోవింద॥ శ్రీకృష్ణ గోవిందహరేమురారే। హేనాథనారాయణవాసు
దేవ। రాధాకృష్ణజై । కృష్ణమురారిజై రాధేగోవిందజై రాధేరాధే॥

శ్లో॥ వృక్షే వృక్షే వీక్షితాఃపక్షిసంఘాః ।
సంఘేసంఘే మంజులామోదవాక్యం ।
వాక్యేవాక్యే మంజులాలాప గోష్ఠిం ।
గోష్ఠ్యాంగోష్ఠ్యాం త్వత్కథా రామచంద్రా ॥

క॥ కృష్ణవాసుదేవ కేశవపరమాత్మ । అప్రమేయవరద హరిముకుంద ।
నిన్నుజూడగంటి నీకృపగనుగొంటి । నఖిలసౌఖ్య పదవులందగంటి॥

క॥ రారా నందకుమారక ! రారానవనీతచోర రారాశౌరీ ।
రారారాజులయేలిక । రారానాముద్దులయ్య రారాకృష్ణా॥

శ్లో॥ తతాతీతి తతాతీతి । తాతతాత తతోతతః ।
తాంతితాంతాం తతుత్తాంతాం । తాంతాంతాంతతా త్తత్త ।

భారత భాగవత రామాయణ సంగ్రహపఠనము.

శ్లో॥ ఆదౌ దశరథరాజగర్భజననం । బాల్యోచితక్రీడనం ।
మౌంజీబంధన వేదశాస్త్రపఠనం గాధేయ శుశ్రూషణం ।
దివ్యాస్త్రగ్రహణం మఖంశుభకరం స్త్రీశాపనిర్మోచనం ।
శంభోఃకార్ముకభంజనం జనకజాకల్యాణనిత్యోత్సవం ।
మధ్యేభార్గవరామగర్వహరణం మాతుఃపితుశ్శోషణం ।
కైకేయాకృతదండకాది గమనం హత్వామృగంకాంచనం ।
వైదేహీహరణం జటాయుమరణం సుగ్రీవసంభాషణం ।
వాలీనిగ్రహణం సముద్రతరణం లంకాపురీదాహనం ।
పశ్చాద్రావణకుంభకర్ణహననం ఏతద్ధిరామాయణం ॥

శ్లో॥ ఆదౌ దేవకి దేవిగర్భజననం గోపీగృహేవర్ధనం ।
మాయాపూతన జీవితా పహరణం గోవర్ధనోద్ధారణం
కంసచ్ఛేదన కౌరవాదిహననం కుంతీసుతాంపాలనం ।
ఏతద్భాగవతం పురాణకథితం శ్రీకృష్ణలీలామృతం ॥

శ్లో॥ ఆదౌపాండవ ధార్త్రరాష్ట్రజననం లాక్షాగృహేదాహనం ।
ద్యూతశ్రీహరణం వనేవిహరణం మత్స్యాలయేవర్తనం ।
లీలాగోగ్రహణం రణేవిహరణం సంధిక్రియాజృంభణం ।
పశ్చాద్భీష్మసుయోధనాదినిధన మేతన్మహాభారతం ॥

* నవగ్రహ స్తోత్రం *

శ్లో॥ నమస్సూర్యాయ చంద్రాయ మంగళాయ బుధాయచ ।
గురుశ్శుక్ర శనిభ్యశ్చ రాహవే కేతవేనమః ॥

... భాగవతస్మృతి ...

శ్లో॥ ప్రహ్లాద నారద పరాశర పుండరీక ।
వ్యాసాంబరీష శుకశౌనక భీష్మదాల్భ్యాం ।
రుక్మాంగదార్జున వశిష్ఠవిభీషణాదీన్ ।
పుణ్యానిమాన్పరమభాగవతాన్స్మరామి ॥

### శక్తిప్రార్థన

శ్లో॥ రాధారామేశ్వరీ రమ్యాకృష్ణమంత్రాధిదేవతా ।
సర్వాద్యా సర్వవంద్యాచ బృందావనవిహారిణీ ।
బృందారాధ్యా రమాశేష గోపీమండల పూజితా ।
సత్యా సత్యపరాసత్యభామా శ్రీకృష్ణవల్లభా ।
వృషభానుసుతా గోపీ మూలప్రకృతిరీశ్వరీ ।
గంధర్వారాధికారమ్యా రుక్మిణీ పరమేశ్వరీ ।
పరాత్పరతరాపూర్ణా పూర్ణచంద్ర నిభాననా ।
భక్తిముక్తిప్రదం నిత్యం భవవ్యాధివినాశినీ ॥

శా॥ బ్రహ్మాండంబు సృజింపఁబెంప సమయింపం జాలు సామర్థ్యమున్ ।
బ్రహ్మోపేతనగేంద్ర చాపులకు సంపాదించుచున్ వారికిన్ ।
బ్రహ్మాత్మైక్య వివేకమిచ్చుచును సంభావించుచున్ బ్రోచునా ।
బ్రాహ్మీమంగళ దేవతాగిరిజలన్ బ్రార్థింతున శాంతమున్ ॥

సీ॥ తనరజోగుణముచేఁద నరంగనే దేవి ।
కల్పించునఖిలలోకములునెల్ల ।
తనసత్వగుణముచే నొనరంగ నేకొమ్మ ।
పోషించునీ సర్వభూతములను ।
తనతమో గుణముచేఁ దగనేవధూమణి ।
జగములనెల్ల సంక్షయముజేయు ।
తాశుద్ధ సత్త్వ ప్రధానయై యేరామ ।
రామాంకమున నజస్రము వసించు ।

గీ॥ సట్టి భువనైకమాత దయా సమేత ।
సద్గుణ వ్రాత నిర్మల స్వాంతపూత ।
భక్తజనమాన సోద్యానపారిజాత ।
సీతకరుణించి నన్నురక్షించుగాత ॥



: లోకశాంతి ప్రార్థన :

పూజనీయమైన ఓ దివ్యస్వరూపా !

లోపలను, వెలుపలను, మీదను క్రిందను అంతటను నిండియున్న ఓ సర్వాంతర్యామీ ! మా లోపల ప్రత్యణువునందు ఇమిడియుండి, మా నేత్రములకు నేత్రము, కర్ణములకు కర్ణము, హృదయములకు హృదయము, మనస్సులకు మనస్సు, శ్వాసలకు శ్వాస, జీవనములకు జీవనము, ఆత్మలకు ఆత్మవై వెల్లుగొండు ఓ దేవా ! ప్రేమైకమూర్తీ ! నిన్ను తెలిసికొను భాగ్యమిప్పుడు యిచ్చటనే ప్రసాదింపుము. ఓ తేజోమయమూర్తీ, తూర్పు పడమరల, ఉత్తర దక్షిణముల ఈ విశ్వమందంతటను అందరును నీ దివ్యతేజస్సును గ్రహింతురుగాక ! ఓ సచ్చిదానందరూపా ! ప్రతిమానవ హృదయమునందును, నానాజాతి మధ్యస్థమునను శాంతి సామరస్యముల ప్రతిష్ఠింపజేయుము. ఇదియే మా మనఃపూర్వకమైన ప్రార్థన. లోకాస్సమస్తా స్సుఖినో భవంతు. ఓం శాంతి శ్శాంతి శ్శాంతిః

---

: శ్రీ రామ మంగళ స్తోత్రం :

శ్లో॥ మంగళం కోసలేంద్రాయ మహనీయగుణాత్మనే ।
చక్రవర్తి తనూజాయ సార్వభౌమాయ మంగళం॥

శ్లో॥ వేదవేదాంతవేద్యాయ మేఘశ్యామలమూర్తయే ।
పుంసాం మోహనరూపాయ పుణ్యశ్లోకాయ మంగళం ।

శ్లో॥ విశ్వామిత్రాంతరంగాయ మిథిలానగరీపతే ।
భాగ్యానాం పరిపాకాయ భవ్యరూపాయ మంగళం॥

శ్లో॥ పితృభక్తాయ సతతం భ్రాతృభిస్సహసీతయా ।
నందితాఖిలలోకాయ రామచంద్రాయ మంగళం॥

శ్లో॥ త్యక్తసాకేతవాసాయ చిత్రకూటవిహారిణే ।
సేవ్యాయ సర్వయమినాం ధీరోదాత్తాయ మంగళం॥

శ్లో॥ సౌమిత్రిణాచ జానక్యాచాపబాణాసిధారిణే ।
సంసేవ్యాయ సదాభక్త్యాసానుజాయాస్తు మంగళం॥

శ్లో॥ దండకారణ్యవాసాయ ఖండితామరశత్రవే ।
గృధ్రరాజాయ భక్త్యాయ ముక్తిదాయస్తుమంగళం ॥

శ్లో॥ సాదరం శబరీదత్త ఫలమూలాభిలాషిణే ।
సౌలభ్యం పరిపూర్ణాయ సత్త్వోద్రిక్తాయ మంగళమ్॥

శ్లో॥ హనూమత్సమవేతాయ హరీశాభీష్టదాయినే ।
వాలిప్రమథనాయాఽస్తు మహాధీరాయ మంగళమ్॥

శ్లో॥ శ్రీమతే రఘువీరాయ సేతోల్లంఘితసింధవే ।
జిత రాక్షసరాజాయ రణధీరాయ మంగళమ్॥

శ్లో॥ ఆసాద్యనగరీం దివ్యామభిషిక్తాయ సీతయా ।
రాజాధిరాజరాజాయ రామభద్రాయ మంగళమ్॥

శ్లో॥ విభీషణకృతే ప్రీత్యా విశ్వాభీష్టప్రదాయినే ।
జానకీ ప్రాణనాథాయ సదా రామాయ మంగళమ్ః

శ్లో॥ మంగళం భగవాన్ విష్ణో మంగళం మధుసూదన ।
మంగళం పుండరీకాక్ష మంగళం గరుడధ్వజ ।

శ్లో॥ నీలాచల నివాసాయా నిత్యాయ పరమాత్మనే ।
సుభద్రాప్రాణనాథాయ జగన్నాథాయ మంగళమ్॥

శ్లో॥ ఉపనయతు మంగళం నస్సకలజగన్మంగళాలయ శ్రీమాన్ ।
దినకరకిరణనిబోధిత, నవనళినదళ నిభేక్షణో రామః॥

శ్లో॥ రామనామతారకం భుక్తిముక్తిదాయకం ।
జానకీమనోహరం సకలలోకనాయకం ।
రఘుపతిరాఘవ రాజారాం పతితపావన సీతారాం ।
అల్లా ఈశ్వర తేరానామ్ సబ్‌కో సమ్మతిదే భగవాన్ ।
శ్రీరామ జయరామ జయరామరామ ।
శ్రీరామ జయరామ జయజయరామ॥

శ్లో॥ కాయేనవాచా మనసేంద్రియైర్వాబుధ్యాత్మనావా
ప్రకృతేస్స్వభావాత్ కరోమియద్యత్సకలం పరస్మై।
నారాయణాయేతి సమర్పయామి॥

గీ॥ సాంబ ముదిగంటి నరసింహశాస్త్రి సుతుడ ।
జన్మముకుమిలె పెరిగితి జమపెడపుర ।
మందు గొలుతునిను హృదయమందు నెపుడు ।
దీనిగైకొని బ్రోవుము దీనరక్ష॥

శ్రీ భగవన్నామ సంకీర్తనం సంపూర్ణం

---

: స్వ స్తి వా చ క ం :

శ్లో॥ స్వస్తిప్రజాభ్యాం పరిపాలయంతాం ।
న్యాయేనమార్గేణ మహీంమహీశాః ।
గోబ్రాహ్మణేభ్య శ్శుభమస్తు నిత్యం ।
లోకాస్సమస్తా స్సుఖినోభవంతు ।
కాలేవర్షతు పర్జన్యః పృధివీ సస్యశాలినీ ।
దేశోఽయంక్షోభ రహితో బ్రాహ్మణాస్సంతు నిర్భయాః ।
అపుత్రాః పుత్రిణస్సంతు పుత్రిణస్సంతు పౌత్రిణః ।
అధనాస్సధనాస్సంతు జీవంతు శరదాంశతం॥

శ్రీ రమారమణ గోవిందోహరిః నమఃపార్వతీపతయే

హరహర మహాదేవ
హరిః ఓం తత్సత్॥

—♦ గ్రం థ సం పూ ర్ణ ం ♦—

---

